# అమెరికా
# అధ్యక్షుల కథలు

మాడ్, మిస్కా పీటర్‌షామ్

అనువాదం:

ఊట్ల కొండయ్య

దేశికవితా మండలి
విజయవాడ-2

Story of the PRESIDENTS of the United States of America Written by Maud and Miskapetersham, Translated into Telugu by V. Kondayya, and Published by Desi Kavita [Mandali with the Kind Permission of Macmillan Company, New York.




దేశీ ప్రచురణ

ప్రథమ ముద్రణ

నవంబరు 1957

దేశీ ప్రెస్, Bza.

వెల:రూపాయిన్నర


సంపాదకులు :

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ



# విషయసూచిక



# జార్జి వాషింగ్టన్

## అమెరికాదేశ జనకుడు

22 ఫిబ్రవరి 1732 — 14 డిసెంబరు 1797

ఫెడరలిస్టు — ప్రథమాధ్యక్షుడు 1789 - 1797

ఫిరంగులు ఘోషిస్తున్నాయి; గంటలు మ్రోగుతున్నాయి; చుట్టుప్రక్కల ఇండ్లకప్పుల మీద, ఆ ఇరుకువీధిలో మూగిన జనం దిక్కులు పిక్కటిల్లేట్లు హర్షధ్వానాలు చేశారు : 'యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ చిరంజీవి యగుగాక!'

ఇది జరిగింది 1789 లో. న్యూయార్కుపట్టణంలోని ఫెడరలు హాలుముందు జనం గుంపులు చేరారు. హర్షధ్వానాలు చేసే ఆ జనం పైగా మేడ వసారాపై మహోత్సాహపూర్ణుడైన ఒక ఆజానుబాహువు నిలచి వున్నాడు; ఆయన, నిండు గోధుమ వర్ణపుసూటు, మోకాళ్ళకిందుగా చల్లడము, తెల్లని మేజోళ్ళు, వెండికొక్కీలు గల బూట్లు ధరించాడు. తెల్లని పొడిచల్లిన

ఆయనజుట్టు చిన్న సంచిలో వెనుకకు కట్టివున్నది; అది ఆనాటి శిష్టాచారం. ప్రజల హర్షధ్వానాలను స్వీకరిస్తూ ప్రత్యభివాదనం చేస్తున్నప్పుడు సహజ దయాపూర్ణమైన ఆయన ముఖంపై గాంభీర్యం అలముకొన్నది.

అమెరికా సంయుక్తరాష్ట్రాల మొదటి అధ్యక్షుడుగా అప్పుడే జార్జివాషింగ్టన్ ప్రమాణ స్వీకారం చేశాడు.

స్వతంత్ర సమరంలో విజయం సాధించిన పదమూడు వలసరాజ్యాలు కలిసి ఒక క్రొత్తదేశం నిర్మాణమైంది. ఈ క్రొత్త దేశానికి మార్గదర్శకుడుగా, నేతగా జార్జివాషింగ్టన్ ఏకగ్రీవంగా ఎన్నిక యైనాడు.

వర్జీనియా రాష్ట్రంలో, వెస్ట్‌మోర్‌లాండ్ మండలంలో, దట్టమైన అరణ్యాలమధ్య, అడవులలాటి బంజరునేలల నడుమ ఒక వ్యవసాయ క్షేత్రంలో జార్జి వాషింగ్టన్ జన్మించాడు. పసితనంలోనే గుర్రపుస్వారి, వేట నేర్చుకొన్నాడు. పొడవుగా నిటారుగా స్తంబువలె పెరిగాడు. పుస్తకాలమీద, చదువుమీద శ్రద్ధపట్టలేదు. పదకొండేండ్ల ప్రాయంలోనే తండ్రి పరమ పదించాడు. కాని, తల్లి దృఢశిక్షణక్రింద స్వతంత్రత, నిర్భీతి అలవరచుకొన్నాడు.

పదహారేండ్లప్రాయానికి సమర్థుడైన సర్వేయ రైనాడు. ఆ పిమ్మట మూడేండ్లపాటు ఒకచేత తుపాకి, మరొకచేత కాంపాస్ పట్టుకొని బ్లూ రిడ్జ్ పర్వతాల కిటు అటు వున్న అటవీప్రాంతాన్ని సర్వే చేస్తూ గడిపాడు. కష్టాలను, ఆపదలను భరించడం అలవరచుకొన్నాడు.

ఓహియో లోయలో ప్రమాదభరితమైన పనిని నిర్వహించటానికి ఈ బాలసర్వేయరును వర్జీనియా గవర్నరు ఎన్నుకొన్నాడు. ఎన్నుకొని, దారి డొంకలు లేని అడవులగుండా వెయ్యిమైళ్ళ ప్రయాణంమీద పంపించాడు.

నిట్టనిలువు పర్వతాలు, మంచునీళ్ళతో వెల్లువలై పారే నదులు వాషింగ్టన్ దాటాడు; మాయలమారి రెడ్ ఇండియనులను ఎదుర్కొన్నాడు; తుదకు, పనిముగించుకొని తిరిగి వచ్చాడు.

వర్జీనియా సైన్యంలో జార్జి వాషింగ్టన్ కలోనెల్ ఐనాడు. ఆరు అడుగులకు పైగా ఎత్తున్నాడు; గొప్ప రౌతు; తుపాకి విద్యలో నేర్పరి. సరిహద్దుప్రాంతంలో ఇండియన్లు, ఫ్రెంచి వాళ్ళు అమెరికా వలస వారిపై దాడిచేస్తున్న రోజులవి. ఇంగ్లీషు జనరలు బ్రాడ్డాక్‌కు అంగరక్షకుడుగా అతడా సరిహద్దుకు వెళ్ళాడు. ఇండియనుల యుద్ధ తంత్రము వాషింగ్టన్‌కు తెలుసును. తన సైనికులను సన్నిహితంగా మోహరించి వుంచాలని బ్రాడ్డాక్



పట్టు పట్టాడు. బ్రిటిష్ సోల్జర్లు ధరించిన మెరిసే ఎర్ర కోట్లు, చాటుమాటుల వున్న ఇండియనులకు సులభ లక్ష్యాలైనవి. జనరల్ బ్రాడ్డాక్ చంపబడ్డాడు. వాషింగ్టన్ వేసు కొన్న కోటుకు తుపాకిగుండ్లు తూట్లుపడినవి. అత డెక్కిన గుర్రాలు-ఒకటి తర్వాత ఒకటి - రెండు తుపాకిదెబ్బలుతిని నేల కూలినవి. కాని అతనికి దెబ్బ తగులలేదు. బ్రాడ్డాక్ సైన్యంలో మిగిలిన సైన్యాన్ని పూర్తి నాశనం కాకుండా కాపాడాడు.

వాషింగ్టన్ సాహసం, సమయస్ఫూర్తి అన్నిరాష్ట్రాలలో తెలిసింది. అతని నాయకత్వం ఆరంభమైంది.

వలసప్రజలు ఇంగ్లాండు పాలనపై తిరుగుబాటు చేశారు. స్వపరిపాలనహక్కు కావలె నన్నారు.

రైతులు సైనికులైనారు; స్వాతంత్ర్యంకోసం యుద్ధం చెయ్యటానికి సన్నద్ధమైనారు. వాషింగ్టన్‌ను తమ సర్వసైన్యాధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు.

మెసాచుసెట్స్‌లోని కేంబ్రిడ్జియందలి మైదానంలో ఒక ఎల్మ్‌చెట్టుక్రింద జనరల్ వాషింగ్టన్ ఖడ్గముదూసి, సర్వసైన్యాధికారము స్వీకరించాడు.

శాంతిపురుషుడు, నిగ్రహసంపన్నుడైన ఈ జనరలు అవసరమైనప్పుడు తీవ్రోద్రేకము చూపగలడుకూడ; దృఢసంకల్పము, ధైర్యము, విశ్వాసము ఆయన సొత్తు. సుదీర్ఘము, అంధకారబంధురమైన అమెరికా విప్లవముగుండా తన సైన్యా



లను అంతిమవిజయానికి నడిపాడు. వలసరాజ్యాలు విముక్తి పొంది ఒక స్వతంత్రజాతిగా తలయెత్తినవి. తన సేనల కివ్వబడిన వేతనం తీసుకోకుండానే, ఆ సర్వ సైన్యాధ్యక్షుడు తన క్రింది ఆఫీసరులకు, సైనికులకు వీడ్కోలు చెప్పి, ప్రియతమమైన తన స్థావరానికి - వర్జీనియాలోని తన తోటలలోనికి తిరిగి వచ్చాడు.

తోటల యజమానిగా మౌంట్ వెర్నన్‌లోనే వాషింగ్‌టన్ శేషజీవితం గడపాలనుకొన్నాడు. కాని ఈ నూతన జాతికి, తనలోని శక్తివంతుల, విజ్ఞానధనుల అవసరం కలిగింది; మరల ఆయన ప్రజారంగంలోనికి పిలువబడ్డాడు. ఫిలడల్ఫియాలో జరిగిన రాజ్యాంగ మహాసభ కాయన అధ్యక్షత వహించాడు. అక్కడే నూతన రాజ్యాంగం రూపొందింది. అటుపిమ్మట

రాజ్యాంగం ఆమోదం పొందిన తర్వాత, సంయుక్త రాష్ట్రాల ప్రజలు ప్రథమాధ్యక్షుడుగా - తా మంతా ప్రేమించి, విశ్వసించే ఆ వ్యక్తిని - ఎన్నుకొన్నారు. ఈ నూతన ప్రజాస్వామిక దేశంలో అధ్యక్షుని "హీజ్ ఎక్సెలెన్సీ," లేక "హీజ్ హైనెస్" అని సంబోధించరాదనీ, "మిస్టర్ ప్రెసిడెంట్" అని మాత్రం సంబోధించాలని నిర్ణయం జరిగింది.

వాషింగ్టన్ సమర్థుడైన నాయకుడుగా మరొకసారి రుజువుపరచుకొన్నాడు. ప్రభుత్వ నూతన శాసనాలను అమలు పరచాడు; దేశాన్ని ఎదుర్కొంటున్న అనేక సమస్యలను పరిష్కరించాడు. ఒక్కొక్కసారి నాలుగేండ్ల చొప్పున రెండు సార్లు అధ్యక్షుడుగా వున్నాడు. మూడవసారి అధ్యక్షుడుగా వుండ డానికి నిరాకరించాడు; మౌంట్ వెర్నన్‌లో విశ్రాంతి తీసికొన్నాడు.

ఇరవై ఒక సంవత్సరం వయసులో, జార్జి వాషింగ్టన్‌కు, మారుటిసోదరునినుండి, పోటోమాక్ నది కెదురుగావున్న సుందర మైన మౌంట్ వెర్నన్ వారసత్వం వచ్చింది. తన భార్య మార్తా కుస్టీస్‌ను, ఇద్దరు పిల్లలను ఇక్కడ తెచ్చి వుంచాడు. ఈ ఎస్టేటు ఒక చిన్న గ్రామంవలె వుండేది. దానిలో పొలాలు, వ్యవసాయక్షేత్రాలు, ఒక ధాన్యం మర, మాంసాదులు నిల్వచేసే ఒక గృహం, కమ్మరి దుకాణం, నూలు వడకటానికి - బట్టలు నేయటానికి ఒక చిన్న ఇల్లు వుండేవి; బానిసల నివాసాలు,



బండిగుర్రాలకు స్వారిగుర్రాలకు శాలలు; ఒక వంద ఆవులు వుండడానికి చావడులు వున్నాయి. వైభవోపేతమైన ఈ గృహంలో జార్జి, మార్తా వాషింగ్టన్‌లు, అతిథులుగా వచ్చే అసంఖ్యాకులైన తమ స్నేహితులకు ఎల్లవేళల స్వాగత మిస్తుండేవారు.

తోటల పెంపకంలో ప్రతి చిన్న విషయంలో వాషింగ్టన్ శ్రద్ధ తీసికొనేవాడు. ప్రతి ఉదయం, రొట్టె, తేనె, తేనీరులతో భోజనంచేసినపిమ్మట, ఆ ఎస్టేటు యజమాని పొలాలలోనికి గుర్రముపైవెళ్ళి, పనివారికి ఎలా చేయాలో చెప్తూ, ముందు తగిన పను లాలోచిస్తూ వుండేవాడు. ఆయన శ్రద్ధాసక్తుల వల్ల ఆ ఎస్టేటులో కావలసిన వన్నీ పండుతుండేవి.

అధ్యక్షపదవిని వదలిన పిమ్మట జార్జి వాషింగ్టన్ రెండేండ్లకు కొంచెముపైగా జీవించాడు. వీలునామాలో, తన బానిసలకు స్వేచ్ఛ ప్రసాదించాడు. ఈ ప్రథమ మహాధ్యక్షుడు యావత్తు దేశప్రజల ప్రేమను చూరగొన్నాడు. ముమ్ముందు ప్రపంచంలోని ప్రజల దేశాలలో ఒకటిగా రూపొందనున్న ఈ దేశానికి ఆయన జనకుడైనాడు.

# జాన్ ఏడమ్సు

## 'శాశ్వత స్వాతంత్ర్యం'

అక్టోబరు 30, 1735 — జులై 4, 1826

ఫెడరలిస్టు — రెండవ అధ్యక్షుడు 1797 - 1801

జార్జి వాషింగ్టన్ పరిపాలన కాలంలో రాజధాని నిర్మాణం కొరకు పొటోమాక్ నదిఒడ్డున ఒక స్థలం నిర్ణయించబడింది. ఈ నూతన వాషింగ్టన్ నగరనిర్మాణం జరుగుతుండగా ఫిలడెల్ఫియా తాత్కాలిక రాజధానిగా వుండేది.

ఫిలడెల్ఫియా యందలి 'ఇండిపెండెన్సు' హాలులో న్యూ ఇంగ్లాండ్ దేశభక్తుడు జాన్ ఏడమ్సు రెండవ అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించాడు. బట్టతలతో, పొట్టిగా, బొద్దుగావున్న జాన్ ఏడమ్సు ముత్యపువన్నె సూటు, పట్టుమేజోళ్ళు, వెండి



కొంకీలుగల బూట్లు, వేసుకొన్నాడు. అతడు గర్వి, ముక్కోపి: వీని అన్నిటినిమించిన దేశభక్తిగలవాడు. వాషింగ్టన్ క్రింద ఉపాధ్యక్షుడుగా ఎనిమిదేండ్లు పనిచేశాడు. సమర్థుడు; న్యాయ వర్తనుడు.

మస్సాఛూసెట్స్‌లో బోస్టన్ సమీపంలో ఉన్న బ్రెయిన్‌ట్రీ అనే చిన్న పట్టణం జాన్ ఏడమ్సు జన్మస్థలము. తన తండ్రి వ్యవసాయ క్షేత్రంలో పాలు పితుకుతూ, వేసవిలో ధాన్యం నూరుస్తూ, శీతాకాలంలో దట్టపుమంచు తొలగద్రోస్తూ తోడ్పడుతూండేవాడు. తన ఇంటి సమీపంలోని స్నేహపాత్రులైన ఇండియనుల కుటీరాలలో కలసి మెలసి తిరుగుతూండేవాడు. పదిహేనవయేట హార్వర్డు కాలేజీలో చేరాడు. పట్టభద్రుడైన పిమ్మట కర్రలతో కట్టిన ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా చేరాడు. అటుపిమ్మట బోస్టనులో న్యాయవాద వృత్తి సాగించాడు.

అమెరికా వలసప్రజలకు ఇంగ్లీషు మనస్తత్వంగల టోరీలకు మధ్య తీవ్ర వైమనస్యం పెరుగుతున్నది. దేశభక్తి పూర్ణుడైన జాన్ ఏడమ్సు వలసరాజ్యాలు సంపూర్ణంగా స్వతంత్రం కావాలని నమ్మాడు. స్వాతంత్ర్య ప్రకటన తయారు చేయటానికి ఎన్నుకొనబడిన ఐదుగురిలో ఆయన ఒకరు. తమ మాతృదేశానికి వ్యతిరేకంగా ఇలాటి సాహసచర్య తీసికోవటానికి చాలామంది వెనుకాడారు. కాని, ఏడమ్సు జంకలేదు. ధైర్యంతో, ఉద్రేకంతో కూడిన ఉపన్యాసాలతో,



స్వాతంత్ర్యప్రకటనను ఆమోదించవలసిందిగా కాంగ్రెసులో వాదించాడు.

మహాశక్తివంతమైన అతని మాటలు బాగా పనిచేసినవి; 1776 జులై 4 వ తేదీన స్వాతంత్ర్య ప్రకటన లాంఛన ప్రాయంగా ఆమోదించబడింది. అమెరికా చరిత్రలోని అతి ప్రధానమైన తేదీలలో ఇది ఒకటి.

స్వతంత్రయుద్ధకాలంలో జాన్ ఏడమ్సు ఫ్రాన్సుకు అమెరికా ప్రతినిధిగా పంపబడ్డాడు. యుద్ధానంతరం ఇంగ్లాండుకు అమెరికా ప్రథమ మంత్రిగా కష్టసాధ్యమైన పదవిలో నియమించబడ్డాడు. అమెరికా వలసలకు పూర్వ పరిపాలకుడైన "హిజ్ మెజిస్టి" మూడవజార్జికి పరిచయం చేయబడినాడు.

ప్రజ్ఞావంతురాలైన అతని భార్య ఎబిగైల్. అతనికూతురుకూడ రాజదర్బారుకు పరిచయం చేయబడినారు. ఎబిగైల్ తన అందాల శిరోజాలంకరణకు 'రిగ్గింగ్' అని పేరు పెట్టింది; రిగ్గింగ్ శిరోజాలంకరణలో, అటు ఇటు ఊగే రెండు తెల్లని తురాయి అమర్చిన పట్టు టోపీ పెట్టుకుని, లేసు, రిబ్బన్లు కుట్టిన గౌను ధరించి ఆమె దర్బారుకు వెళ్ళింది. ఎబిగైల్ న్యూ ఇంగ్లాండులో పుట్టి పెరిగింది. కాని, దర్బారు ఆమె కన్నులను మిరుమిట్లు గొలుపలేదు. అది ఆమెకు రసహీనంగా, అనాకర్షకంగా తోచింది.

జాన్ ఏడమ్సు అధ్యక్షుడుగావున్న కాలంలోనే ప్రభుత్వ కార్యాలయం వాషింగ్టన్ నందలి నూతన భవనానికి తరలింది. అధ్యక్షభవనంలో ఓం ప్రథమంగా నివసించినవారు ఆయన, ఆయన భార్య. ఆ కాలంలో ఆ నగరం చుట్టూ చిత్తడినేలలు, అడవులు వుండేవి. వీధులు చదునుగా వుండేవికావు: ప్రభుత్వ భవనాలు అసంపూర్తిగానే వున్నాయి. అధ్యక్ష భవనం బోసిగా బావురుమంటూ వుండేది. చెట్టు చేమలు లేవు; ప్రాకారంలేదు; పెరడులేదు. "ఒక్క సామానుకూడా లేని విశాలమైన కొలువు గదిలో బట్టలు వ్రేలాడగట్టి ఆరబెట్టాను" అని ఎబిగైల్ ఆడమ్సు తన ఇంటికి వ్రాసింది. జాన్ ఏడమ్సు ఆ అధ్యక్ష భవనాన్ని ఈ విధంగా ఆశీర్వదించాడు; "సత్యసంధులు, వివేకవంతులు తప్ప అన్యులు ఈ ఇంటిపట్టున పరిపాలింపకుందురు గాక!"



జాన్ ఏడమ్సు పరిపాలన ప్రజాదరణ పొందలేదు. ఈ నాలుగేండ్లలోను ప్రభుత్వంలో అభిప్రాయభేదాలు క్రమంగా హెచ్చినవి. ఆ అధ్యక్షుడు తిరిగి ఎన్నుకొనబడలేదు. ఆయనకు ఆశాభంగం కలిగింది; భ్రాంతి తొలగిపోయింది. తన తర్వాతి అధ్యక్షుని ప్రమాణ స్వీకారోత్సవానికి హాజరు కాలేదు. ఆ రోజు తెల్లవారుఝామునే అధ్యక్షభవనం వదలి, బండియెక్కి న్యూ ఇంగ్లాండ్ ఇంటికి వెళ్ళిపోయాడు.

మరణానికి ఒక ఏడు ముందు, జాన్ ఏడమ్సు తన కొడుకైన జాన్ క్విన్సీ ఏడమ్సును చూచాడు. ఈయనకూడా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. తన సహాయంతో ప్రకటించబడిన తొలి స్వాతంత్ర్యదినపు పదిహేనవ వార్షికోత్సవంరోజున, 4 జులై 1826 న జాన్ ఏడమ్సు మరణించాడు. తొంభైఏండ్ల ఆ వృద్ధ దేశభక్తుణ్ణి రానున్న జులై నాలుగవ తేదీ విందుకు శుభవాచక మివ్వవలసిందిగా అడుగగా ఆయన ఇచ్చిన జవాబు "శాశ్వత స్వతంత్రం." ★

## థామస్ జఫర్‌సన్

### స్వాతంత్ర్య ప్రకటన రచయిత

ఏప్రియల్ 13, 1743 — జులై 4, 1826

రిపబ్లికన్ — మూడవ అధ్యక్షుడు 1801 - 1809

జాన్ ఏడమ్సు తర్వాత అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినవ్యక్తి ఒక నూతన ప్రజాస్వామిక భావాన్ని ప్రభుత్వంలోనికి తీసుకువచ్చాడు. రాజుల పరిపాలనను పోలిన వాటి నన్నిటినీ పోనాడి, ఎక్కువ అధికారాలు ప్రజల హస్తగతంచెయ్యాలని విశ్వసించే ఒక నూతన రాజకీయపక్షాని కాయన నాయకుడు. ఆ కాలంలో ఆయనపార్టీ రిపబ్లికన్ పార్టీ అని పిలువబడుతుండేది; దరిమిలా ఆ పార్టీయే డెమోక్రాటిక్ పార్టీ అని పిలువబడింది.

పొడవాటి, సన్నని మిష్టర్ జఫర్‌సన్ కొంచెము నెరసిన ఎరుపురంగు జుట్టుతో, సాధారణ వలసప్రజల దుస్తులతో, మూడవ అధ్యక్షుడుగా ప్రమాణస్వీకారం చెయ్యడానికి విడిది ఇంటినుండి, బురద వీధులగుండా నడచి అధ్యక్షభవనానికి వచ్చాడు. ఆయన కోరినట్లే, పదవీస్వీకారం ఎట్టి ఆడంబరం, ఆచారాలు లేకుండానే జరిగింది.

థామస్ జఫర్‌సన్ అధ్యక్ష ఆచారాలను చాలామార్చాడు. ఆయన వెనుకటి అధ్యక్షులు ఆరుగుర్రాలబండిలో వెళ్ళేవాళ్ళు;

కాని జఫర్సన్ గుర్రంమీద వెళ్ళేవాడు. రాదలచుకొన్న అందరికీ అధ్యక్షగృహం తెరచివుండేది. అతిథులు కూర్చో వటంలో ముందువెనకల భేదం లేకుండా వుండటంకోసం గుండ్రని భోజనాలబల్ల అమర్చబడింది.

వర్జీనియాలో, ఆల్బెమార్లే మండలంలోని షాడ్వేవ్లో థామస్ జఫర్సన్ పుట్టాడు. దృఢకాయుడు, సాహసుడు ఐన అతని తండ్రి అక్కడ అడవి నరికి తోటలు వేశాడు. ఇండి యనులు, కొద్దిమంది వలసవారూ వారికి ఇరుగుపొరుగు. మచ్చల ముఖము, ఎర్రజుట్టుగల ఆ పిల్లవానికి అడవులలో, పొలాలలో గుర్రంపై స్వారిచేయటం సరదా. కాని, అతనికన్నిటికంటే ప్రీతిపాత్రమైనస్థావరం, సమీపంలోవున్న ఒక చిన్నకొండ; పెద్దయిన తర్వాత ఆ కొండపై ఇల్లుకట్టుకోవాలని నిశ్చ యించుకొన్నాడు.



తండ్రిద్వారా పుస్త కాలమీద, సంగీతం మీద ప్రీతి అలవరచు కొన్నాడు. విలియమ్సు బర్గునందలి విలియం

అండ్ మేరీకాలేజీక పంపబడ్డాడు. ఇక్కడ కళ, సాహిత్యం, వేదాంత, భౌతిక శాస్త్రాలలో అతని ఆసక్తి పెరిగింది. ఇరవై నాలుగవయేటికి విజయవంతంగా న్యాయవాదవృత్తి సాగించాడు.

జఫర్సన్ బహుముఖ ప్రజ్ఞగల మేధావి. ముందు, విద్వాంసుడైనాడు; పిమ్మట రాజనీతిజ్ఞుడైనాడు.

అతడు వాస్తుశాస్త్రజ్ఞుడు, స్రష్ట, విశాల ఉద్యానవన నిర్మాత, కృషీవలుడు. అధ్యక్షుడుగా వున్నప్పుడుకూడ తోటపని ముట్లు, డ్రాయింగ్ టేబిలు దగ్గర వుంచుకునేవాడు.

సర్వకాలాల రాజకీయ మహానాయకులలో థామస్ జఫర్సన్ ఒకడైనాడు. మానవులందరికు సమాన హక్కులుండవలెననే ఆయన నమ్మకం. పత్రికా, వ్యక్తి, మత స్వాతంత్ర్యములయందు విశ్వాసం కలవాడు. సభలో మాట్లాడటానికి బెరుకుపడేవాడు; కాని, శక్తివంతమైన శైలి వ్రాసేవాడు. స్వాతంత్ర్యప్రకటన వ్రాసిన వాడాయనే. కొన్ని చిన్న మార్పులు మాత్రం బెంజమిన్ ఫ్రాంక్లిన్, జాన్ ఆడమ్సులు చేశారు. స్పష్టమైన స్ఫూర్తితో ఆయన వ్రాసిన ఈ పత్రం ప్రభుత్వ పత్రాలలో మహోన్నతమైన వాటిలో ఒకటిగా ఖ్యాతి పరపబడివున్నది. అది ఒక చిన్న మేజామీద వ్రాయబడింది. ఆ మేజా నమూనా తయారుచేసిన దాయనే.

తాను గాఢంగా ప్రేమించిన భార్యావియోగానంతరం జఫర్సన్ తన సమస్తశక్తులను దేశసేవకు మరల్చాడు.



వర్జీనియా గవర్నరుగానూ, ఫ్రాన్సులో తనదేశ ప్రతినిధిగానూ పనిచేశాడు. వాషింగ్టన్ క్రింద ప్రథమ రాజ్యాంగ కార్యదర్శి గను, జాన్ ఏడమ్సు క్రింద ఉపాధ్యక్షుడుగను ఉన్నాడు.

జఫర్సన్ అధ్యక్షకాలంలో, ఫ్రెంచివారి ఆధీనమందున్న లోవిసైనా భూభాగం క్రయంద్వారా సంయుక్తరాష్ట్రాల పరిమాణం రెండింతలైంది. ఈ విశాల భూభాగాన్ని పరిశీలన చెయ్యటంకోసం జఫర్సన్ కొందరు పరిశోధకుల జట్టును పంపించాడు. ఈ ప్రాంతం ఎంత కారడవి మయమంటే మాస్టోడన్, మామత్ అనబడే ప్రాచీన మృగాలు కన్పడుతాయేమో వెతుకవలసిందిగా ఈ జట్టు ఆజ్ఞాపించబడింది. వీరు పశ్చిమదిశగా ప్రయాణంచేసి, ఇండియన్ జాతి నాయకులతో చెలిమిచేసి, పసిఫిక్ మహాసముద్రము మేరకు సంయుక్త

రాష్ట్రాల సరిహద్దును పెంచగల భూభాగాన్ని ఆధీనంలోనికి తెచ్చారు.

ఎనిమిదేండ్లు అధ్యక్షుడుగా వుండిన పిమ్మట, మూడవ సారి నిరాకరించి, తాను ప్రేమించిన కొండపై నిర్మించుకొన్న ఇంటికి విశ్రాంతికై వెళ్ళాడు. దాని కతడు "మాంటిసెల్లో" అని పేరు పెట్టాడు. ఇది ఇటలీ పదము; "చిన్న పర్వతము" అని



అర్థము. వర్జీనియా అంతటిలో అతిసుందరమైన వ్యవసాయ క్షేత్రంగా రూపొందింది. ఈ ఇంటిలో ఆయన సేకరించిన గ్రంధాలు, ఫ్రాన్సునుండి ఆయన తెచ్చిన చిత్రపటాలు సుందరవస్తువులు, తాను స్వయంగా కనిపెట్టిన అనేకవస్తువులు- తిరిగే మేజా, కాలంతోపాటు వారాలుకూడా తెలిపే గడియారం, మడతనిచ్చెన, మరికొన్ని నూతన పరికరాలు - వున్నాయి.

విశ్రాంతి గైకొన్న అనంతరంకూడా దేశవ్యవహారాలలో ఆయన పాల్గొంటుండేవాడు. వర్జీనియా విశ్వవిద్యాలయమునకై ఆయన ఎంతోకాలం ఆసక్తి అంకితం చేశాడు. దాని సంస్థాపకుడు, నిర్మాత ఆయనే. కూతురు, కూతురు బిడ్డల నడుమ ఎనభై మూడేండ్లు జీవించాడు.

'థామస్ జఫర్‌సన్ ఇంకను బ్రతికియే వున్నాడు.' ఇవి జాన్ ఏడమ్స్ మరణసమయంలో జులై 4. 1826 న అన్న మాటలు. కాని, అంతకు కొన్ని గంటలముందే సరీగాస్వాతంత్ర్య ప్రకటన ఆమోదించబడిన యాభైయేండ్లకు, జఫర్‌సన్ లోకాన్ని విడిచి వెళ్ళాడు. తన సమాధిపై ఈ క్రింది సాధారణ వాక్యాలు చెక్కవలసిందిగా జఫర్‌సన్ కోరాడు.

"స్వాతంత్ర్యప్రకటన రచయిత
వర్జీనియా మత స్వాతంత్ర్య శాసన రచయిత
వర్జీనియా విశ్వవిద్యాలయ జనకుడు
థామస్ జఫర్‌సన్ ఇక్కడ సమాధియైనాడు"

★

# జేమ్సు మేడిసన్

## రాజ్యాంగ జనకుడు

మార్చి 16, 1751 — జూన్ 28, 1836

రిపబ్లికన్ — నాల్గవ అధ్యక్షుడు 1809 - 1817

సంయుక్తరాష్ట్రాల నాల్గవ అధ్యక్షుడైన జేమ్సు మేడిసన్ విద్వాంసుడు. రాజ్యాంగకార్యదర్శిగా థామస్ జఫర్‌సన్‌తో ఎనిమిదేండ్లు పనిచేశాడు; పొట్టివాడు; సిగ్గరి; మృదుభాషి; శాంతవర్తనుడు; నిశితము, ప్రతిభావంతమైన మేధస్సుకల వాడు. ఆయనభార్య డాలీ మేడిసన్ అందాలరాశి; మహాస మూర్తియైన తనభర్తచుట్టు ఆమె స్నేహితులను చేర్చి, అధ్యక్షభవనాన్ని ఆనంద నిలయం చేసేది.

వర్జీనియాలోని పోర్టుకాన్వేలో జేమ్సు మేడిసన్ పుట్టాడు. సంపన్నుడైన ఒక తోటల యజమాని జ్యేష్ఠపుత్రు డాయన. చిన్నతనంలో సన్నగా, బలహీనంగా వుండేవాడు; ఆటలమీద కంటే పుస్తకాలమీదనే ఎక్కువ శ్రద్ధ చూపేవాడు. ప్రిన్స్టన్ కాలేజీలో పట్టభద్రుడైనాడు. చరిత్ర, రాజ్యాంగశాస్త్రము లతని అభిమానశాస్త్రములు. థామస్ జఫర్‌సన్ వద్ద న్యాయశాస్త్ర మభ్య సించాడు. ఆయనకు శాశ్వత మిత్రుడైనాడు; ప్రజాస్వామిక ముపై ఆయనకు గల విశ్వాసంలో భాగస్వామియైనాడుకూడ.



వలసలు స్వాతంత్రంకొరకు యుద్ధం చేస్తున్న కాలంలో తాను సైనిక సేవకు పనికిరాకపోవటంచేత, జేమ్సు మేడిసన్ తన కృషిని, జ్ఞానాన్ని, పరిపాలనా సమస్యలపైపు మరల్చాడు. రాజ్యాంగ నిర్మాణ మహాసభలో ఆయన ప్రముఖ సభ్యుడు; రాజ్యాంగంలో ఆయన భావాలు చాలా పొందుపరచటంచేత, తరచు ఆయన "రాజ్యాంగ జనకుడు" అని పిలువబడుతున్నాడు.

ప్రత్యక్షంగా అధ్యక్షుడుగాకంటే, తెరవెనుకవుండి బలంగా పని చెయ్యగలడని మేడిసన్ రుజువు పరుచుకున్నాడు. ఆయన పరిపాలనను తీవ్రసమస్య లెదుర్కొన్నాయి. పెద్దయెత్తున ఇండియనులు తిరుగుబాటు చేశారు; ఇంగ్లాండుతో మరొకసంగ్రామం జరిగే ప్రమాదం ఏర్పడింది. సముద్రంమీద బ్రిటీషు, ఫ్రెంచి నావలు అమెరికను నావలపై దాడి చేస్తున్నాయి. అమెరికను నావలపై బ్రిటిషువారు ఎక్కి, బ్రిటిషుపౌరు లనే సాకుతో నావి

కులను తొలగిస్తున్నారు. శాంతస్వభావుడు, సాధుమూర్తియైన మేడిసన్ అధ్యక్షుడు శాంతియుతమార్గాలద్వారా ఈ సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నించాడు. కాని, తుదకు అమెరికా యుద్ధంలోనికి లాగబడింది. సముద్రంపై అమెరికనుల హక్కుల రక్షణకొరకు పోరాడింది. యుద్ధనౌకలు భయంకర యుద్ధంలో పాల్గొన్నవి. రెండేండ్లపాటు జరిగిన ఈ 1812 సంవత్సరపు యుద్ధంలో సంయుక్తరాష్ట్రాలు అపజయానికి చాలా దగ్గరకు వచ్చాయి.

ఒక బ్రిటిషునౌకాదళం చెసపీక్ అఖాతములో ప్రవేశించి, అక్కడ సైనికులను దించింది. ఈ సైనికులు వాషింగ్టన్ మీదకు దాడి వెడలారు. నగరాన్ని పట్టుకొన్నారు; ప్రభుత్వ భవనాలు అనేకం దగ్ధం చేయబడినవి. బ్రిటిషుసైన్యాలు రాకకు ముందు సాహసురాలైన డాలీ మేడిసన్, గౌరవప్రపత్తులతో భద్రపరచబడిన జార్జివాషింగ్టన్ చిత్రపటాన్ని చట్రంనుండి తీస్తూ చాలా కాలయాపన చేసింది. అది బ్రిటిషువారి చేతులలో పడరాదని ఆమె సంకల్పం. ఈ చిత్రపటమే ఈనాడు వైట్ హౌస్‌లో వ్రేలాడుతున్నది.

మూడురోజుల అనంతరం బ్రిటిషుసైన్యాలు వాషింగ్టన్ వదలివెళ్ళినవి. అధ్యక్ష దంపతులు శిథిలమైపోయిన ప్రభుత్వ భవనానికి మరలి వచ్చారు; అధ్యక్షభవనం గోడలుమాత్రమే నిలిచివున్నాయి.



జెమ్సు మేడిసన్ ఎనిమిది కల్లోల సంవత్సరాలపాటు అధ్యక్షుడుగా వున్నాడు. రెండవసారి అధ్యక్షపదవీకాలం తీరిన పిమ్మట అధ్యక్షదంపతులు, మాంటిపెలియర్‌కు విశ్రాంతికి వెళ్ళారు. మాంటిపెలియర్ గృహం మాడిసన్‌కు తండ్రివల్ల వచ్చిన వారసత్వం. గ్రంథాధ్యయనంలోనూ, గ్రంథరచనలోనూ నిమగ్నుడై ఎనభైయైదేండ్లు జీవించాడు. అధ్యక్షుడుకాకముందు శాసన నిర్మాతగా నిర్వహించిన పాత్రవలన ఆయన ఎక్కువగా స్మరించబడుతున్నాడు. ★

## జేమ్సు మన్రో

### కడపటి ముక్కోణపుటోపీ అధ్యక్షుడు

ఏప్రియల్ 28, 1758 — జులై 4, 1831

రిపబ్లికన్ — ఐదవ అధ్యక్షుడు 1817 - 1825

బ్రిటిషువాళ్ళచేత సౌభాగ్యము కోల్పోయి, దగ్ధంచేయు బడిన వాషింగ్టన్ నందలి ప్రభుత్వభవనము 1817 నాటికి ఇంకా పూర్తిగా పునర్నిర్మాణం కాలేదు. భవనానికిఎదుట నిర్మించబడిన ఒక వేదికమీదనుండి సంయుక్తరాష్ట్రాల ఐదవఅధ్యక్షుడుగా జేమ్సుమన్రో ప్రమాణస్వీకారంచేశాడు.

చాలాఏండ్లు స్వదేశసేవ చేసి అనుభవం సంపాదించిన రాజకీయవేత్త మన్రో; చాలా నిదానస్థుడు; సామాన్యవ్యక్తి: గొప్ప ప్రజ్ఞాశాలికాదు; కాని, విశ్వాసపాత్రుడనీ, నీతివంతుడనీ, ఋజువు పరుచుకొన్నాడు. సర్వులకు ప్రేమ పాత్రుడైనాడు. పొడవుగా వుండేవాడు; దయామయమైన నీలికండ్లు; భుజాలు వంగివుండేవి; ముఖం ముడతలుపడి వుండేది.

అధ్యక్షభవనం పునర్నిర్మాణం పూర్తి ఐంది. ఇక్కడ ఆయన కూతురు, సౌందర్యవతి అని ప్రసిద్ధిగాంచుటే గాక లండన్, పారిస్ రాజసభలతో పరిచయంగల ఆయనభార్యతో కలిసి ఖచితమైన సాంఘిక మర్యాదలు ప్రవేశపెట్టారు. తమను

చూడవచ్చే అతిథులు లాంఛనప్రాయమైన దుస్తులు వేసుకోవాలని పట్టుబట్టారు; తమను చూడవచ్చినవారిని తిరిగి చూడటానికి వారి ఇండ్లకు వెళ్ళేవారుకారు. కాని, మన్రో అధ్యక్షుడుమాత్రం నిరాడంబరంగా, భేషజాలు లేకుండా సంచరించేవాడు.

వర్జీనియాలో వెస్ట్‌మోర్‌లాండ్ కౌంటీలో జేమ్సుమన్రో జన్మించాడు. మన్రో సముద్రశాఖ ఒడ్డున ఒక చిన్న వ్యవసాయక్షేత్రము ఆయన నివాసము. ఆయన చిన్ననాటి సంగతులు అట్టే తెలియవు.



పద్దెనిమిదేండ్ల ప్రాయానికి విలియం అండ్ మేరీ కాలేజీలో చదువుతున్నాడు; పొడవుగా, గంభీరంగా వుండేవాడు. స్వతంత్ర యుద్ధారంభంలో, దేశభక్తి ప్రపూర్ణుడై, మన్రో పుస్తకాలను విడిచిపెట్టి, జనరల్ వాషింగ్టన్ క్రింద సైనికుడైనాడు. అంధకారబంధురమైన ఫోర్జ్ లోయ యుద్ధపు రోజులలో అతడువాషింగ్టన్‌తోనేవున్నాడు; యుద్ధంలో బ్రిటిషు తుపాకిగుండు తగిలి గాయపడ్డాడు.

యుద్ధానంతరం థామస్ జఫర్‌సన్ వద్ద న్యాయశాస్త్రం అభ్యసించాడు. మన్రో, మేడిసన్‌లపై థామస్ జఫర్‌సన్ ప్రభావము బాగా పడింది. ఈ ముగ్గురు వర్జీనియా రాష్ట్రీయులు సన్నిహితమిత్రులు; ఒకేరకం రాజకీయ విశ్వాసాలు, ఆదర్శాలు కలవారు.

మాంటిసెల్లోలోని జఫర్‌సన్ ఇంటికి కొన్ని మైళ్ళ దూరంలో మన్రో కట్టిన క్రొత్త ఇంటికి పథకాలన్నీ జఫర్‌సన్ వేశాడు.

మన్రో జీవితంలో ఎక్కువభాగం ప్రజాసేవలో గడిచిపోయింది. ఇరవై ఐదవఏట రాజ్యాంగ నిర్మాణసభలో అందరికంటే పిన్న సభ్యు డతడే. ఫ్రాన్సుకు రాయబారిగా పంపబడ్డాడు; కాని తిరిగి రావింపబడ్డాడు; ఫ్రెంచి విప్లవవాదులయెడ ఎక్కువ సానుభూతి చూపినాడని ఆయనపై నేరారోపణ చేయబడింది. రెండుపర్యాయములు వర్జీనియా గవర్నరుగావున్నాడు. 1821 యుద్ధకాలంలో రాజ్యాంగ కార్యదర్శిగను, యుద్ధకార్యదర్శిగను ఏకకాలంలో పనిచేశాడు.

జేమ్సు మన్రో అధ్యక్షు డయ్యేనాటికి దేశభవిష్యత్తు ప్రకాశవంతంగావున్నది. ప్రజల ఐశ్వర్యం అభివృద్ధి బొందుతున్నది. యుద్ధం గడచిపోయింది. దేశమంతా ఆత్మవిశ్వాసంతో నిండివుంది. సంయుక్త రాష్ట్రాలు అభివృద్ధి చెందుతున్నవి. సాహసవంతులైన పురోగాములు పశ్చిమదిశగా, అపార సహజ సంపదగల, నూతన ప్రదేశాలకు త్రోసుకొనిపోతున్నారు.

తనతోపాటు పనిచేయటానికి మన్రో వివేకవంతులను ఏరుకొన్నాడు: రెండవపర్యాయము ఆయన అధ్యక్షుడుగా ఎన్ను కొనబడినప్పుడు ఒక్క వోటుమాత్రం ఆయనకు వ్యతిరేకంగా పడినది. ఆయన పరిపాలనకాలంలో శాశ్వతనిర్ణయాలు చేయ బడినవి. విశాలమైన అడవులతోనూ బురద నేలలతోనూ నిండిన ఫ్లోరిడాను స్పెయినునుండి అమెరికా కొన్నది. మిస్సోరీ కాంప్రొమైజ్ అనేచట్టాన్ని కాంగ్రెసు చేసింది; ఒకే సమ యంలో ఒక స్వతంత్రరాష్ట్రం, ఒక బానిసరాష్ట్రం యూనియను లో చేరుట కవకాశమిచ్చుట ద్వారా, స్వతంత్ర, బానిసరాష్ట్రాల మధ్య తూకాన్ని ఈ చట్టం కాపాడింది. మన్రోసిద్ధాంతం అన బడే వివేకవంతమైన విధానాన్ని మన్రో అధ్యక్షుడు నెల కొల్పాడు. అమెరికాలలో ఇంకా ఎక్కువప్రాంతాన్ని వశంచేసు కోవద్దని పాత ప్రపంచానికి ఈ సిద్ధాంతం, హెచ్చరికచేస్తూ, అందుకు బదులుగా ఇతరదేశాల వ్యవహారలలో అమెరికా జోక్యం కలుగజేసుకోదని ప్రమాణపూర్వకంగా చెప్పింది.

అధ్యక్షపదవి విరమించిన అనంతరం మన్రోవద్ద అట్టే డబ్బులేదు. భార్యా మరణానంతరం వర్జీనియా ఆస్తిని అమ్మి వేశాడు; న్యూయార్కుపట్టణంలో తన కూతురు దగ్గర చివరి కాలం వెళ్ళబుచ్చాడు. వంగిన భుజాలుగల డెబ్బైమూడేండ్ల ఈ దుర్బలవ్యక్తి ఇంకా పాతకాలపు మోకాళ్ళకిింది చల్లడము, వెండికొక్కెలుగల బూటులు, ముక్కోణపు టోపీ ధరించేవాడు. ముక్కోణపు టోపీధరించన అధ్యక్షులలో జేమ్సు మన్రో ఐదవ వాడు, చివరివాడుకూడ. ★

# జాన్ క్విన్సీ ఏడమ్సు

## వాగ్ధాటి గల వృద్ధుడు

జులై 11, 1767 — ఫిబ్రవరి 23, 1848

రిపబ్లికన్ — ఆరవ అధ్యక్షుడు 1825 - 1829

జేమ్సు మన్రో తర్వాత అధ్యక్షుడైన జాన్‌క్విన్సీ ఏడమ్సుకు ఆయన ఎన్నికైన విధానము దురదృష్టంగా పరిణమించింది. ఏ అభ్యర్థికీ అధికసంఖ్యఓట్లు రాలేదు; పోటీఫలితాన్ని నిర్ణయించవలసినభారం ప్రతినిధుల సభపై పడింది. సంయుక్త రాష్ట్రాల రెండవ అధ్యక్షుడైన జాన్ ఏడమ్సు కుమారుడు జాన్ క్విన్సీ ఏడమ్సును ప్రతినిధులు నిర్ణయించారు.

ఈ నిర్ణయం అధర్మమని చాలామంది భావించారు; ఈ నూతనాధ్యక్షునిపై చాలామంది పగగొన్నారు. ప్రజల అత్యధి కాభిప్రాయంతో కాక్ కాంగ్రెస్ నిర్ణయంద్వారా తాను అధ్యక్షుడు కావడం ఏడమ్సుకుకూడా సంతోషంగా లేదు. ఆయన అనుభవ శాలి యైన రాజనీతిజ్ఞుడు; నీతివంతుడు; సత్యసంధుడు; కల్ల కపటము లేనివాడు. వైట్‌హౌస్‌లో క్లిష్టతరమైన నాలుగేండ్లు ఆయన పాలించాడు.

అమెరికా విప్లవము బ్రద్దలుకాకముందు తీవ్రసంచలనపు రోజులలో, మెసాచుసెట్స్‌నందలి క్విన్సీలో జాన్ క్విన్సీ ఏడమ్సు పుట్టాడు. ఇంకా ఎనిమిదేండ్లు నిండకముందు, అతడు



తల్లితోపాటు, తన ఇంటిదగ్గరవున్న ఒక కొండఎక్కి బంకర్ హిల్ యుద్ధపు పొగ, మంటలు చూచాడు. స్వేచ్ఛాస్వాతంత్ర్యము లనుగూర్చి ఉద్రేకంగా గంభీరముఖులైన మనుషులు మాట్లాడటం విన్నాడు. తన దినచర్య పుస్తకంలోని పుటలలో సైనికుల, ఫిరంగుల, నౌకల బొమ్మలు గీశాడు.

తండ్రితో ఫ్రాన్సుకు వెళ్లేనాటికి అతనివయస్సు పదేండ్లు. అమెరికాలోని స్వాతంత్ర్యమునుగూర్చి ఇతర రాజకీయవేత్త లతో ఫ్రాన్సులో తన తండ్రి చర్చించటం విన్నాడు. తన పద్నాలుగవయేట, రష్యాలో అమెరికను మంత్రికి కార్యదర్శిగా వెళ్ళాడు.

హార్వర్డుకాలేజీలో తన విద్యాభ్యాసం పూర్తిచెయ్యటానికి జాన్ క్విన్సీ ఏడమ్సు బోస్టన్‌కు తిరిగి వచ్చాడు. న్యాయవాద



వృత్తి ప్రారంభించగానే, ఆయన శక్తిసామర్థ్యాలను ప్రెసిడెంటు వాషింగ్టన్ గుర్తించి, హాలండుకు మంత్రిగా పంపించాడు. కొన్ని సంత్సరాలపాటు ఇతర యూరపియను దేశాలలో పనిచేశాడు. స్వదేశంలో ప్రెసిడెంటు మనో్రి కింద రాజ్యాంగ కార్యదర్శిగ మనో్రి సిద్ధాంతాన్ని రూపొందించటంలో ప్రముఖపాత్ర వహించాడు.

వాషింగ్టన్‌లో ప్రెసిడెంటు జాన్ క్విన్సీ ఏడమ్సు వీలైనంత నిరాడంబరంగా జీవించాడు. హాయిగావుండే తక్కువ రకం గుడ్డలువేసుకోవడం ఆయనకు ఇష్టం. ప్రతి ఉదయవేళ, సూర్యోదయం కాకముందే కొన్నిమైళ్ళు వెళ్తూ; తరచు పొటో మాక్‌నదిలో ఈదటానికి అక్కడ ఆగేవాడు; తర్వాత వైట్ హౌస్‌కు తిరిగి వచ్చేవాడు; అప్పు డవసరమని తోస్తే పంట వేసుకొనేవాడు.

ఉదయ భోజనానికి ముందు బైబిలులో మూడు అధ్యాయాలు చదివేవాడు. రోజంతా, దర్శనానికి వచ్చేవాళ్ళతో మాట్లాడేవాడు. రాత్రి భోజనానంతరం ఒంటరిగా కూర్చొని అర్ధ రాత్రివరకు పని చూచుకునేవాడు.



గంభీరస్వభావుడు, విద్యాధికుడు, న్యూ ఇంగ్లాండునుండి వచ్చిన ఈ అధ్యక్షుని విధానము లనేకములు పాత విధానములు గానో లేక కేవల వైజ్ఞానికములుగానో పరిగణించబడినవి. జాతీయసంపదలను సంరక్షించటానికీ, కళలను విజ్ఞానశాస్త్రాన్ని

అభివృద్ధిచేయటానికి కృషి చేశాడు. రాజకీయఋణాలు తీర్చటానికి పదవులు అందించటానికి నిరాకరించాడు. ఏ పార్టీకీ ఆయన భక్తిబద్ధుడుకాలేదు; తనకు న్యాయమని తోచిన దానినే చేశాడు. ఏ పార్టీ అతనికి అండగా లేకపోవటంచేత తిరిగి ఎన్నికకాలేదు.

కానీ, జాన్ క్విన్సీ ఏడమ్సుకృషి అంతటితో సమాప్తము కాలేదు. తాను విశ్వసించిన విధానాలకొరకు పోట్లాడటంకోసం; దేశంలోకెల్ల ఉన్నతపదవి నలంకరించిన ఈవ్యక్తి, ప్రతినిధుల సభలో సాధారణసభ్యుడుగా వాషింగ్‌టన్‌కు తిరిగివచ్చాడు. తన ప్రతిపక్షులతో భయంకరంగా వాదోపవాదాలుచేస్తూ చాలాయేండ్లు కాంగ్రెస్ సభ్యుడుగా వున్నాడు. ఆయన అంత ప్రసంగంగా వాదించేవాడు కనుకనే "వాగ్ధాటిగల వృద్ధుడు" అని పిలువబడే వాడు.

కాంగ్రెస్‌భవనంలో, ఉపన్యాసకుని గదిలో, ఎనభైఒక్క యేండ్ల ఈ వృద్ధరాజకీయవేత్తకు పక్షవాతం వచ్చింది. రెండు రోజుల తర్వాత ఆయన మరణించాడు.

జాన్ క్విన్సీ ఏడమ్సు తీవ్రమైన ప్యూరిటన్ భావోద్రేకముగల అమెరికసు; ఆయన తన దేశమునకు అన్నిట శ్రేష్ఠ విషయాలనే వాంఛించాడు.

★

## ఆండ్రూ జాక్సన్

### 'వృద్ధ హికొరీ'

మార్చి 15, 1767 — జూన్ 8, 1845

డెమొక్రాట్ — ఏడవ అధ్యక్షుడు 1829 - 1837

మహావేగంగా సంయుక్తరాష్ట్రాలు వృద్ధిచెందుతున్నవి. చాలాకొత్తరాష్ట్రాలు యూనియనులో చేరినవి. నగరాలు, పట్టణాలసంఖ్య పెరుగుతున్నది. ఒక క్రొత్తతరగతి కర్షకులు కార్మికులు, పడమటి వలసవారూ ప్రభుత్వవ్యవహారాలలో భాగం కావాలన్నారు. ఈ నూతనవర్గాలు ప్రజలనుండి వచ్చిన సాధారణవ్యక్తి అధ్యక్షుడు కావాలని గట్టిగా కోరారు. విద్యాధికుడైన జాన్ క్విన్సి ఆడమ్సు పిమ్మట ఆయనస్థానంలో ఆండ్రూ జాక్సన్‌ను వారు ఎన్నుకొన్నారు. ఆండ్రూ జాక్సన్ ఇండియనులతో పోరాడిన వాడు; యుద్ధ వీరుడు; థామస్ జెఫర్‌సన్ స్థాపించిన రాజకీయపార్టీకి చెందినవాడు. ఆ పార్టీయే ఇప్పుడు డెమొక్రాటిక్ పార్టీ అని పిలువబడుతున్నది. తమ వీరుడు ఆండీ జాక్సన్ సంయుక్తరాష్ట్రాల ఏడవ అధ్యక్షుడు కావటం చూడ టానికి అడవులు సరికే కార్మికులూ, సైనికులు సంతో షాతిరేకంతో వాషింగ్‌టన్‌కు గుంపులుగా వచ్చారు.

అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించిన పిమ్మట, పొడవాటి, బక్కచిక్కిన ఆ జనరల్ రేగిన మంచులాటి తెల్లని



జుట్టుతో, నిశ్చలమైన నీలికన్నులతో గుర్రమెక్కి అధ్యక్షభ
నానికి దారి పట్టాడు. రాజకార్య దురంధరులు, ఖ్యాతివహించి
అతిథులు ఆయన నభినందించుట కక్కడ చేరివున్నార
జాక్సన్‌ను వెన్నంటి భక్తిపరాయణులైన అతని అనుచరు
ఆ భవంనలోనికి గుంపులుగావచ్చి నిండారు. ఆయనను చూడాల
ఆదుర్దాలో గాజుసామాను, పింగాణిసామాను పగులగొట్టార
తివాసీలమీద- కుర్చీలపై కప్పిన బుట్టాలసెల్లాలమీద బుర
బూట్ల ముద్ర వేశారు. ఈ వేడుకల మధ్యలో అంతూ
జాక్సన్ చల్లగా జారుకొన్నాడు. తన విజయోత్సాహంలో
ఆయన దుఃఖాకులుడైన ఏకాకి; ఎందుకంటే ఆయన ప్రిం
పత్ని రాఖేల్, ఆయన ప్రమాణస్వీకారమునకు కొంచెంముం
చనిపోయింది.

దక్షిణ కెరొలినా యందలి వాక్సా వలసలో కర్రలతో కట్టిన ఇంటిలో ఆండ్రూ జాక్సన్‌పుట్టాడు. అమెరికా అధ్యక్షులలో విదేశీ జననీ జనకులకు పుట్టినవా డాయన ఒక్కడే. ఆయన తల్లితండ్రులు స్కాట్‌లాండ్, ఐర్లాండులనుండి వలస వచ్చినవారు. ఆండ్రూ పుట్టకముందే తండ్రి చనిపోయినాడు. ఆ భయంకరాటవీ ప్రాంతాలలో అతని తల్లి ఆండీని, అతని ఇరువురు సోదరులను పోషించటానికి ఎంతో శ్రమ పడింది.

అమెరికను తిరుగుబాటు వాక్సాసు వలసవారిని భీభత్సంలో ముంచింది. పసివాడైన ఆండీ ఖైదీఐనాడు: అప్పుడొక బ్రిటిషు ఆఫీసరు బూట్లు తుడవటానికి నిరాకరించి అతని పటాకత్తిపోటు తిన్నాడు; ఆ మచ్చ బ్రతికినంతకాలం వుంది.

పదిహేనవయేట ఆండ్రూ జాక్సన్ తనకుతానే సంరక్షకుడైనాడు. అతనితల్లి, సోదరులు చనిపోయారు. పొడవుగా సన్నగా వుండేవాడు; ఎర్రనిజుట్టు గుబురుగావుండేది; చాలా వుద్రేకి. ఉపాయంతోనూ, బాహుబలంతోనూ మార్గం సుగమం చేసుకొన్నాడు; స్వంతంగా చదువుకొన్నాడు. అతని జీవితం భీభత్సంతో ఒడుదుడుకులతో నిండివుంది. అతడు హాజరుకాని కోడిపందెంగానీ గుర్రాలపందెంగానీ లేనేలేదు.

యువకుడైన ఆండ్రూ జాక్సన్ టెన్నెసీ సరిహద్దులో నివాస మేర్పరచుకొని లాయరైనాడు. పిమ్మట జడ్జియై, వివిధ ప్రాంతాలలో న్యాయవిచారణకొరకు భయంకరమైన అడవుల

గుండా మైళ్ళదూరం గుర్రింపై స్వారిచేసేవాడు. దుకాణదారుగా వున్నాడు; తోటల యజమానియైనాడు; అనేక ఎకరాల భూస్వామి యైనాడు. అతనిముక్కోపితనం ద్వంద్వయుద్ధాలకు, తగాదాలకు దారితీసింది. కాని స్నేహితు లందరితో నమ్మకంగా, మర్యాదగా సాయిలా ఫాయిలాగా వుండేవాడు. ఒక 'పురోగామి' కూతురును పెండ్లాడాడు; టెన్నెసీలోని నాష్‌వెల్లిలో ఇల్లు కట్టుకొన్నాడు.

క్రీక్, సెమినోల్ జాతి ఇండియనుల తిరుగుబాటు నణచటానికీ, అభిమానవంతులైన ఆటవికయుద్ధవీరులను బలవంతపరచి సంధి చేసుకోవటానికీ ఆయన టెన్నెసీ సేనాదళనాయకుడుగా పంపబడ్డాడు. తన సైనికుల ఆకలిచిచ్చును, క్లేశాన్ని పాలుపంచుకొన్నాడు. అందరికంటే ధృఢగాత్రుడైన స్నేహితుడు నడచినంతదూరం తానూ నడచేవాడు; అతని సిందూరగింజల ఆహారాన్ని పంచుకుని తినేవాడు. అతని సైనికులతనిని "వృద్ధ హికొరీ" అని పిలిచేవారు. ఎందుకంటే - వారెరిగిన కొయ్యలలో హికొరీ అన్నిటికంటె గట్టిది. కాని, ఆండ్రూ జాక్సన్ దయార్ద్రహృదయుడు; సాధుమూర్తి కూడ. యుద్ధరంగంలో వదలివేయబడి తనకు దొరికిన ఇండియను





శిశువును తన స్వంత కుమారునివలె ఆయన పెంచాడు.

1812లో జనరల్ ఆండ్రూ జాక్సన్ బ్రిటిషువారిని సంపూర్ణంగా జయించి, న్యూఓర్లియన్సును కాపాడినప్పుడు దేశ మంతట అతనికీర్తి వ్యాపించింది.

కాంగ్రెస్‌లో టెన్నెసీ ప్రథమ ప్రతినిధిగానూ, సెనెటర్‌గానూ, కొద్దికాలం ఫ్లోరిడా ప్రథమ గవర్నరుగానూ ప్రభుత్వ వ్యవహారాలలో జాక్సన్ కొంత అనుభవము పొందాడు. ఏదో ఒకటి సంభవించి, ఆయన యుద్ధచైతన్యాన్ని మేల్కొల్పేవరకు ఆయనకు రాజకీయాలలో పూర్ణాసక్తి పుట్టేదికాదు. ఆయన అధ్యక్షుని ఎన్నికకు జాన్ క్విన్సీ ఆడమ్సుకు పోటీగ నిలిచినప్పుడు, ఇరువురిలో ఎవరికీ మెజారిటీవోట్లు రానందున, కాంగ్రెస్ ఆడమ్సును నిర్ణయించింది. నాలుగేండ్లతర్వాత ఆయన పెద్ద మెజారిటీతో అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

ప్రెసిడెంట్ జాక్సన్ నిరంకుశంగా పరిపాలించాడు. ఆయనపరిపాలన 'ఆండ్రూ రాజు' పాలన అని పేరుపొందింది. ప్రభుత్వ కార్యాలయంలో చాలామందిని తొలగించి, ఆ స్థానాలలో తన అనుచరులను పెట్టాడు. ప్రభుత్వ ధనం నిక్షేపించి వున్న యునైటెడ్ సేట్స్ బ్యాంకును అతడు విశ్వసించలేదు. దాన్ని అతడు బ్రహ్మరాక్షసి అని పిలచేవాడు; ఆ బ్రహ్మ రాక్షసితో యుద్ధం చేశాడు; ప్రభుత్వ ధనాన్ని ఉపసంహరించుకున్నాడు. బ్యాంకు చతికిలపడింది.

రాజకీయజీవితంతోనూ, పాత యుద్ధపు గాయాలతోనూ చితికిపోయి, రెండవసారు పదవీకాలం తీరగానే, 'వృద్ధహికారీ' నాష్విల్లీ దగ్గర తన తోటలలోని 'ఆశ్రమాని'కి విశ్రాంతికై వెళ్ళాడు. యుద్ధశీలుడైన ఆండ్రూ జాక్సన్ కొందరిచేత ద్వేషించబడ్డాడు; చాలామందిచేత ప్రేమించబడ్డాడు ✱

# మార్టిన్ వాన్ బూరెన్

## ఎఱ్ఱ నక్క

డిసెంబరు 5, 1782 — జులై 24, 1862

డెమోక్రాట్ — ఎనిమిదవ అధ్యక్షుడు 1837 - 1841

ఆండ్రూజాక్సన్ వైట్‌హౌస్‌ను విడిచి వెళ్ళేముందు, తన స్నేహితుడు, అనుచరుడు ఐన మార్టిన్ వాన్ బూరెన్ తన తర్వాత అధ్యక్షుడుగా ఎన్నిక అయ్యేట్లు చూచాడు. వాన్ బూరెన్‌ను "చిన్న వాన్" అని పిలిచేవారు; అతడు చాలా సూక్ష్మబుద్ధిగల రాజకీయవేత్త; రాజకీయపుటెత్తులు వేయటంలో ఎంత తెలివిగల వాడంటే - అతన్నిగూర్చి "ఎఱ్ఱనక్క" అనీ "చిన్న గారడీవాడు" అనీ చెప్పుకొనే వారు. జాక్సన్‌లాగానే అతడు స్వయంకృషితో పైకి వచ్చాడు. పొట్టిగా వుండేవాడు; రాజసంగా వర్తించే హుందాగా దుస్తులు వేసుకొనేవాడు. శ్రుతిమించిన అతని అభిరుచులనుచూచి, అతనిప్రత్యర్థులు, బంగారుచెమ్చాలతో అన్నం తినే బడాయికోరని అపహాస్యం చేస్తుండేవారు. అధ్యక్షుడు కాకపూర్వం మార్టిన్ వాన్ బూరెన్ అనేక రాజకీయ పదవులలో వున్నాడు.

చక్కని తలకట్టు, నీలికండ్లుగల మార్టిన్ వాన్ బూరెన్ తలిదండ్రులు డచ్చివారు. న్యూయార్కులో, ఆల్బనీ దగ్గర, హడ్సన్ నదిఒడ్డున కిండర్ హుక్ గ్రామంలో అతడు జన్మిం

చాడు. చిన్నతనంలో గ్రామంలో తండ్రి నడుపుతున్న భోజన వసతిగృహంలో, పానీయములిచ్చి గదిలో పనిచేశాడు. రాజధానికి ప్రయాణంచేస్తున్న రాజకీయ నేత్తల తీవ్ర వాదోపవాదాలు అక్కడతడు విన్నాడు.

పధ్నాలుగేండ్లప్రాయంలో పాఠశాల వదలి న్యాయకార్యాలయంలో గుమాస్తాగా చేరాడు. పలుకుబడి, సంపదగల న్యాయవాది యైనాడు. ఎల్లప్పుడు రాజకీయాలలో ఆయనకు అత్యాంతాసక్తి వుండేది; ఒక రాజకీయాధికారంనుండి మరొకరాజకీయాధికారానికి పెంపొందాడు; డెమోక్రాటిక్ పార్టీలో ఆయనకు గొప్ప పలుకుబడి వుండేది.



ఆండ్రూ జాక్సన్ ప్రెసిడెంటు ఎన్నికలకు నిలచినప్పుడు అతనిఎన్నికకు వాన్ బూరెన్ తీవ్రంగా కృషిచేశాడు, అతర్వాత ప్రెసిడెంట్ జాక్సన్‌కు అత్యంతాభిమాన పాత్రుడైనాడు.



నాడు. జాక్సన్ రెండవసారి అధ్యక్షుడుగా వున్నప్పుడు అతడు రాజ్యాంగ కార్యదర్శిగను, ఉపాధ్యక్షుడుగను పనిచేశాడు.

వాన్ బూరెన్ అధ్యక్షుడుగా ఎన్నికైన వెంటనే దేశ మంతటా ఆర్థిక సంక్షోభం చెలరేగింది. ఆకస్మిక సంప దభి వృద్ధివల్లను, అతి లాభాపేక్షతో జరిగిన వాణిజ్య సాహసాల వల్లనూ, మితిమించిన విస్తృతివల్లనూ కలిగిన ఫల మది. బ్యాంకులు మూతపడినవి; వ్యాపారం దెబ్బతిన్నది; ఆస్తులు కరగిపోయినవి.

భవిష్యత్తులో సంక్షోభాలు నివారించటంకోసం, బ్యాంకుల సహాయం లేకుండానే ప్రభుత్వ ధనం నిక్షేపించటానికి ఒక స్వతంత్ర ధనాగారాన్ని నెలకొల్పుతూ కాంగ్రెస్ శాసనంచేసింది.

మార్టిన్ వాన్ బూరెన్ రెండవసారి అధ్యక్షుని ఎన్నికకు నిలచాడు; కాని హిగ్స్ అని పిలువబడే రాజకీయపార్టీఅభ్యర్థిచేత ఓడించబడ్డాడు. జాక్సన్ వాన్‌మూర్‌ల విధానాలను వ్యతిరేకించే వారిచేత హిగ్స్ నిర్మాణం చేయబడింది.

ఎనిమిదేండ్ల తర్వాత మరల అధ్యక్షుని ఎన్నికకు వాన్‌మూర్ అభ్యర్థిగా నిలిచి, మరల ఓడిపోయాడు. కాని, కిండెర్‌హుక్‌లోని తన గృహంలో మరణించేపర్యంతం తన దేశ వ్యవహారాలలో నిశిత బుద్ధియైన ఈ రాజకీయవేత్త పలుకుబడి సాగుతూనే వుంది.

*

## విలియం హెన్రీ హారిసన్

### టిప్పికానో వీరుడు

ఫిబ్రవరి 9, 1773 — ఏప్రియల్ 4, 1841

హిగ్స్ — తొమ్మిదవ అధ్యక్షుడు 1841

వాన్ బూరెన్ అనంతరము అరవై తొమ్మిదేండ్ల జనరల్ విలియం హెన్రీ హారిసన్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. ఈ ముసలి జనరల్ ఇండియనులతో యుద్ధాలు చేసినవాడు; 1812యుద్ధవీరుడు. చలికాలపు మార్చి నాలుగవ తేదీనాటి ఎముకలు కొరికే గాలిలో ప్రమాణస్వీకారానికి జనరల్ హారిసన్ గుర్రంపై కాంగ్రెస్‌భవనానికి వెళ్ళాడు. భయావహం, ఉన్మాదపూర్ణమైన అతని ఎన్నికల ప్రచారంలో ఆయన నిరాడంబరుడుగా, స్నేహశీలిగా చిత్రించబడ్డాడు. ఆయన పడమటిప్రాంతపువాడు; పురోగామిజీవితం ఎరిగినవాడుకావటంచేత కర్రలఇల్లు, కూన్‌చర్మము, ఏపిల్ సారాయిపీపా అతని ఎన్నికల చిహ్నములైనవి.

వర్జీనియాలో జేమ్సు నదిఒడ్డున ఒక తోటలో విలియం హారిసన్ జన్మించాడు. ఈయనతండ్రి స్వాతంత్ర్య ప్రకటనపై సంతకం చేసినవారిలో ఒకడు; జార్జి వాషింగ్‌టన్‌కు స్నేహితుడుకూడ. పద్దెనిమిదవయేట హారిసన్ విద్యాభ్యాసం విడిచిపెట్టి వాయవ్యప్రాంతంలో జరుగుతున్న యుద్ధంలో ప్రవేశించాడు;



అక్కడ ఒంటరిగావున్న వలసవారిపై ఇండియన్లు భయంకర యుద్ధం సాగిస్తున్నారు. యుద్ధతంత్రంలో అతడు నిపుణుడై నాడు; సేనలో ఉన్నతపదవి పొందాడు. ఇండియానా భూభాగంలో టిప్పికానోవద్ద ఇండియను యుద్ధవీరులు అతని నాయకత్వంక్రింద అణచబడినారు; ఆయన వీరుడైనాడు. ఇండియానాకు గవర్నరుగా ఎన్నికమై సంయుక్తరాష్ట్రాల వాయవ్య ప్రాంతాన్ని రూపొందించుటలో ఆయన చాలా కృషి చేశాడు.

ప్రమాణ స్వీకారమునాటి చలిగాలితో శీతలముచేసి, పదవులకొరకు ప్రాకులాడేవారి దాడితో ప్రాణము విసిగి, ప్రమాణస్వీకారానంతరము ఒక నెల తర్వాత న్యూమోనియా జబ్బుచేసి ఈ టిప్పికానోవృద్ధవీరుడు చనిపోయాడు. సంయుక్త రాష్ట్రాల అధ్యక్షు లందరిలో తక్కువకాలం పరిపాలించినవాడాయనే.



# జాన్ టైలర్

## 'టిప్పికానో మరియు టైలరు కూడ'

మార్చి 29. 1780 — జనవరి 18, 1862

విగ్ — పదియవ అధ్యక్షుడు 1814 - 1845

సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగము ననుసరించి, పదవీ కాలంలో అధ్యక్షుడు మరణించినట్లయితే ఉపాధ్యక్షుడు అధ్యక్షు డవుతాడు. వర్జీనియావాడగు జాన్ టైలరు, విలియం హారిసన్ క్రింద ఉపాధ్యక్షుడుగా వున్నాడు. "టిప్పికానో మరియు టైలరుకూడ" అనేది ఎన్నికల ప్రచారంలో ఉపయోగించబడిన నినాదం.

టైలరు ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొనబడినప్పుడు దేశానికి అధినేత ఔతాడని కలలోకూడ ఎవరూ అనుకోలేదు. దక్షిణాది ఓట్లు సంపాదించటానికి ఆయనకు విగ్ టికిట్ యివ్వబడింది. మర్యాద, మన్నన లెరిగిన ఈ దక్షిణాది పెద్దమనిషి సంతతో ల్లాసి; అనేక రాజకీయ పదవులలో పనిచేశాడు. కాని పేరు ప్రతిష్ఠలు రాలేదు.

ప్రెసిడెంటు హారిసన్ మరణవార్తను వార్తాహరుడు కొనివచ్చినప్పుడు, జాన్ టైలర్ విలియమ్సుబర్గునందలి తన ఇంటి పచ్చికబయలుపై కొడుకులతో ఆడుకొంటున్నాడు. సంయుక్తరాష్ట్రాల పదియవ అధ్యక్షుడుగా ప్రమాణం తీసికోవ

టానికి, వాషింగ్టన్ పోవటంకోసం స్నేహితుల దగ్గర డబ్బు అప్పుతీసికొన్నాడు. ఉత్తరాధికారిగా అధ్యక్షుడైన మొదటి ఉపాధ్యక్షు డాయనే.

ప్రెసిడెంట్ టైలరు భార్య అమెరికా మొదటి ఇల్లాలు కాగానే, అధ్యక్షుని నాల్గు గుర్రాలబగ్గీ ఆచారం పునరుద్ధరించింది.



వైట్‌హౌస్‌లో జరిగే కార్యకలాపాల సందర్భంలో కూర్చోవటానికి ఆమె ఎత్తు మండపం ఏర్పాటు చేసుకున్నది.

వర్జీనియా యందలి గ్రీన్‌వే లో ఒక తోటలో ఆయన జన్మించాడు. ఆయనతండ్రి జడ్జిగాను, తర్వాత వర్జీనియా గవర్నరుగానూ వున్నాడు. యువకుడైన టైలరు విలియంమేరీ కాలేజీలో పట్టభద్రుడై, తన తండ్రివలె లాయరై, తర్వాత రాజకీయవేత్త ఐనాడు. ఇరవై ఒకటవ సంవత్సరమప్పుడు



రాష్ట్రశాసన సభ్యుడైనాడు; తర్వాత గవర్నరుగానూ, పిమ్మట సంయుక్తరాష్ట్రాల గవర్నరుగానూ వున్నాడు.

స్వతంత్ర వ్యక్తియైన టైలరు వైట్‌హౌస్ ప్రవేశించిన వెంటనే చికాకులు తలయెత్తినవి. హారిసన్‌తోపాటు హిగ్ టికెట్‌పై తాను ఎన్నిక యైనప్పటికినీ, హిగ్ విధానాలు పెక్కింటిని ఆయన ఆమోదించలేదు. హిగ్‌పార్టీ ప్రవేశపెట్టిన ఒక బిల్లును ఆయన వీటో చేశాడు; తత్ఫలంగా ఒక్కరుతప్ప ఆయనమంత్రివర్గ మంతా రాజీనామా చేసింది. పిమ్మట ప్రెసిడెంట్ టైలరు బానిసలను పెట్టుకొన్న దక్షిణాదిని అభిమానించే మంత్రివర్గాన్ని నియమించాడు.

తన పరిపాలనాకాలంలో ఆయన గ్రేట్‌బ్రిటన్‌తో, మైనీ కెనడాల సరిహద్దును నిర్ధారణచేసే ఒడంబడికను పూర్తి

చేశాడు. ఫైనాతో, సంయుక్తరాష్ట్రాల వ్యాపారానికి రేవుల అనుమతి ఇచ్చే ఒడంబడిక చేసికొనబడింది. టెక్సాసును యూనియనులో చేర్చుకొనే బిల్లుపైన సంతకం చేయటం ఆయన చివరి అధికారాలలో ఒకటి. ఇది బానిసతనం అనుమతించబడిన రాష్ట్రం.

ఉభయపక్షాలు అభిమానించని తన పదవీకాలం తీరిన పిమ్మట జాన్ టైలరు వర్జీనియాకు తిరిగి వచ్చాడు. అతని సానుభూతి ఎప్పుడూ దక్షిణాదిమీదనే వుండేది. పదహారేండ్ల తర్వాత దక్షిణాదిరాష్ట్రాలు యూనియన్‌నుండి ఉపసంహరించు కొన్న పిమ్మట ఆయన రాష్ట్రసమాఖ్య కాంగ్రెస్ సభ్యుడైనాడు. రాష్ట్రాల అంతర్యుద్ధకాలంలో ఆయన చనిపోయినాడు. ★

# జేమ్సు కె. పోక్

## అజ్ఞాత అభ్యర్థి

నవంబరు 2, 1795 — జులై 15, 1849

డెమోక్రాట్ — పదకొండవ అధ్యక్షుడు 1845 - 1849

అధ్యక్షుడుగా ఎన్నికైనవారిలో మొదటి అజ్ఞాతవ్యక్తి జేమ్సు పోక్. జాన్ టైలరు పదవీకాలం కదబడుతుండగా జరిగిన డెమోక్రాట్ల మహాసభలో తీవ్ర వాదోపవాదాలు చెలరేగినవి కాని, అభ్యర్థి నిర్ణయంపై ఏకాభిప్రాయం కుదరలేదు. చిట్టచివరకు జేమ్సుపోక్‌ను నిలపటానికి రాజీ పడ్డారు. ఆయన కురచగా, గంభీరంగా వుండేవాడు. టెన్నెసీ గవర్నరుగా సమర్థుడనిపించుకొన్నాడు. జేమ్సు పోక్‌ను కొద్దిమంది ఎరుగుదురు: క్రొత్తగా కనిపెట్టబడిన టెలిఫోనుద్వారా వాషింగ్‌టన్‌సంగిలి రాజకీయవేత్తలకు అతని నియామకంవార్త అందింది. పోక్ నియామకంపై వారికి కలిగిన ఆశ్చర్యంలో టెలిగ్రాము వార్త నిజమని నమ్మరాదని నిర్ణయించటమే కాక, ఆ వార్తను ధృవపరచే జాబుకొరకు వేచివున్నారు. పోక్ ఎన్నికలలో గెలిచాడు; ప్రాముఖ్యం లేనట్లు కనిపించిన ఈ అజ్ఞాత వ్యక్తి అతి సమర్థుడైన అధ్యక్షుడుగా పరిణమించాడు.

నార్త్ కెరొలినాలో లిటిల్ సుగర్‌క్రీక్ అనే కయ్యఒడ్డున ఒక పొలం ఇంటిలో జేమ్సుపోక్ పుట్టాడు. అతని తలిదండ్రులు ఐరిష్ వారు. అతని పసితనంలోనే, అతని తలిదండ్రులు

పర్వతాలు దాటి టెన్నెసీకి వచ్చారు; ఇక్కడ వారు భూమి బాగుచేసుకొని ఇల్లు కట్టుకొన్నారు.

ఆ బాలకుడు ఆలోచనా నిమగ్నుడు, గంభీరుడుగా పెరిగాడు. పుస్తకాలన్నా, చదువన్నా తగని మక్కువ. నార్త్ కెరొలినా విశ్వవిద్యాయంలోచేరి, తర్వాత టెన్నెసీ సరిహద్దులో గ్రామీణ న్యాయవాదియైనాడు. మనిషి పొట్టిగావున్నా దృఢ సంకల్పంతో మాట్లాడేవాడు. "నెపోలియన్ ఆఫ్ ది స్టంప్" అనే బిరుదుపొందాడు.



రాజకీయాలలో పోక్ పార్టీ మనిషి; నూటికి నూరుపాళ్ళు డెమోక్రాట్. టెన్నెసీ శాసన సభలలోనూ,సంయుక్తరాష్ట్రాల కాంగ్రెస్‌లో పధ్నాలు గేండ్ల పాటు సభ్యుడుగానూ, టెన్నెసీ గవర్నరుగానూ, దేశవ్యవహా రాలలో సునిశిత వివేకమూ, దూరదృష్టి చూపి కష్టించి పని చేసిన రాజకీయవేత్త ఆయన. జేమ్సు పోక్ వైట్ హౌస్‌కు వచ్చినప్పుడు తానేమి

సాధించదలచుకొన్నాడో స్పష్టమైన భావాలతో వచ్చాడు.

సంయుక్త రాష్ట్రాలలో భాగంగా కాలిఫోర్నియాను సంపాదించాలని పోక్ వాదించాడు. ఆకాలంలో కాలిఫోర్నియా మెక్సికోకు చెందిన భూభాగంగావుంది; కాని అమెరికా 'పురోగాము' లనేకు లచట నివాసా లేర్పరచుకొంటున్నారు.



అంతకుముందే యూనియన్‌లో ఒక రాష్ట్రంగా చేర్చుకొనబడిన టెక్సాస్‌లో కొన్ని ప్రాంతాలు తనకు రావాలని ఇంకా కోరుతున్న మెక్సికన్లు తమ అసమ్మతి ప్రకటించారు. రియోగ్రాండీనదిని టెక్సాస్ సరిహద్దుగీతగా అంగీకరించటానికి వారు నిరాకరించారు.

అధ్యక్షుడు పోక్, ఈ సమస్యా పరిష్కారానికి రియోగ్రాండీకి సైన్యాలను పంపాడు. ఇది రెండుదేశాలమధ్య యుద్ధా

నికి దారితీసింది. సంధిచేసుకోవటానికీ, కాలిఫోర్నియాతోకూడిన విశాల భూభాగాన్ని, న్యూ మెక్సికో, అరిజోనాలను సంయుక్త రాష్ట్రాలకు అమ్మటానికి మెక్సికో ఒప్పుకొనక తప్పిందికాదు.

1848 లో కాంగ్రెస్‌కు తన చివరి సందేశంలో ప్రెసిడెంట్ పోక్ కాలిఫోర్నియాలో బంగారం కనిపెట్టబడిన సంగతి చేర్చాడు. మితిలేని ఆ బంగారుభూములవైపు జనం తండోపతండాలుగా తరలారు. ప్రవ్వితేచాలు బంగారందొరికేది.

వైట్‌హౌస్‌లో పదవి విరమించిన అనంతరం మూడు నెలలు మాత్రమే జేమ్సు పోక్ జీవించాడు. అప్పటి కాయన వయస్సు యాభైమూడేండ్లు మాత్రమే. కాని, తలమాత్రం మంచంత తెల్లబడింది. ప్రస్తుతి ఎరుగని ఈ ప్రశాంత వామన మూర్తి సంయుక్తరాష్ట్రాల అసాధారణ విస్తృతికాలంలో ధీరుడైన అధ్యక్షుడుగా వున్నాడు.

★

# జెకరీ టైలర్

## వృద్ధ కఠినుడు, సర్వసన్నద్ధుడు

నవంబరు 24, 1784 — జులై 9, 1850

విగ్ — పన్నెండవ అధ్యక్షుడు 1849 - 1850

జేమ్సుపోక్ అనంతరం ఒక సైనికోద్యోగి అధ్యక్షుడైనాడు. "వృద్ధకఠినుడు, సర్వసన్నద్ధుడు" అని ప్రసిద్ధి పొందిన జనరల్ జెకరీ టైలరు జీవితంలో అధికభాగం సేనలో గడిపాడు. గంటలు మ్రోగుతుండగా, మిలిటరీ గానం వినిపిస్తూ వుండగా జెకరీటైలర్, నాలుగు గుఱ్ఱాల అధ్యక్ష శకటంమీద ప్రమాణ స్వీకారానికివచ్చాడు.

మెక్సికను యుద్ధంలో అతడు సాధించిన అనేక విజయాలవల్ల అతడు ప్రజాభిమానం చూరగొన్నాడు. నీతివంతుడనీ, కల్ల కపటం లేనివాడనీ పేరుపొందాడు. అంతకుముందు రాజకీయాలలో పాల్గొనకపోయినా, తుదకు తాను "విగ్ కాని, అతివాద విగ్ కాదు" అని ప్రకటించుకున్నాడు. పార్టీలో చాలా విభిన్నాభిప్రాయాలుండటంచేత ఎట్టి సమావేశం లేకుండానే అభ్యర్థిగా నిర్ణయించబడ్డాడు.

అతడు చాలా నిరాడంబరంగా, నిష్కపటంగా వుండేవాడు. కాళ్ళు కురచ కావటంచేత గుఱ్ఱం ఎక్కటానికి

సహాయం కావలసివచ్చేది. సైనికుల గుడారాలు, బారకాసులు అతనికి స్వంత ఇల్లుగా వుండేవి. కాని, సైనికదుస్తులు వేసుకోవటమంటే అతనికి ఇష్టంగా వుండేదికాదు. సైనికుడైన తన భర్తతోపాటు అతనిభార్య ఒకస్థావరంనుండి మరొక స్థావరానికి వెన్నంటి వెళ్ళుతూ వుండేది. వైట్‌హౌస్ ఇల్లాలు కావలెననే కోర్కె ఆమెకు లేనేలేదు.



వర్జీనియా యందలి ఆరంజికౌంటీలో జెకరీటైలరు జన్మించాడు. ఆయన తండ్రి సైనికోద్యోగి. అతడు ప్రప్రథమంగా నేర్చుకొన్నది తుపాకి ప్రేల్చటం. ఈ కుటుంబం వర్జీనియా నుండి కెంటకీ యందలి మొదటి సరిహద్దు కుటీరానికి తరలింది. అక్కడ పరిసర ప్రాంతమంతా అరణ్యమయం; అంతే కాక పగగొన్న ఇండియనులకు ఆవాస భూమి.



దేశద్రిమ్మరియైన ఒక ఉపాధ్యాయునివద్ద చదివినచదువే ఆతడీ కాలంలో అభ్యసించిన విద్య. ఈ 'పురోగామి' జీవితంలోని తీవ్ర కష్టనిష్ఠురాలే జెకరీ టైలరుకు దృఢత్వమూ, ఆత్మావలంబనము నేర్పినవి.

ఇరవై రెండవయేట యునైటెడ్ స్టేట్స్ సైన్యంలో అతడు లెప్టినెంట్ ఐనాడు. ఇండియనులతో జరిగిన యుద్ధాలలో అతడు పోరాడాడు. 1812 సంవత్సరపు యుద్ధంలో ప్రాముఖ్యానికి వచ్చాడు. నలభై యేండ్లు సైనికుడుగా పనిచేశాడు.

మెక్సికను యుద్ధంలో, తన సేనకంటె అనేకరెట్లు పెద్ద సైన్యాన్ని ఘనంగా జయించి, మెక్సికన్ జనరలైన శాంతా అన్నాను జనరల్ టైలర్ ఓడించాడు.

జెకరీ టైలరు అధ్యక్షుడైనప్పుడు బానిసల సమస్యలపై అభిప్రాయభేధాలు తీవ్రరూపం దాలుస్తున్నవి. బానిసతనంలేని రాష్ట్రంగా యూనియన్‌లో చేరటానికి కాలిఫోర్నియా దరఖాస్తు చేసింది. కాని, మెక్సికను యుద్ధానంతరం యునైటెడ్ స్టేట్సు సంపాదించిన ఇతర విశాల భూభాగాలలో బానిసతనాన్ని అనుమతించాలా లేదా అన్నది పరిష్కరించవలసిన పెద్ద సమస్య అయింది.

ప్రమాణస్వీకరణానంతరం పదహారు నెలల తర్వాత ప్రెసిడెంట్ జెకరీ టైలర్ మరణించాడు. ఇంకా అసంపూర్తిగా వున్న వాషింగ్‌టన్ స్మృతిచిహ్నంవద్ద జరిగిన ఉత్సవానికి వెళ్ళి వడదెబ్బ తిన్నాడు; మూడురోజుల తర్వాత ఆయనకు మరణం సంభవించింది.

అధ్యక్షుడుగా తన్ను తాను ఋజువు పరచుకోవటానికి "వృద్ధ కఠినుడు, సర్వ సంసిద్ధుడు" కు ఎక్కువకాలం లభించ లేదు. అధ్యక్షుని పదవీకాలాన్ని పూర్తిచేయటానికి మరొకసారి ఉపాధ్యక్షుడు నియమించబడినాడు.

★

# మిల్లర్డ్ ఫిల్మోర్

## ఉపాధ్యక్షతనుండి అధ్యక్షతవరకు

జనవరి 7, 1800 | మార్చి 8, 1874

విగ్ | పదమూడవ అధ్యక్షుడు 1850 - 1853

జెకరీ టైలర్ మరణించగానే ఉపాధ్యక్షుడైన మిల్లర్డ్ ఫిల్మోర్ అధ్యక్షుడైనాడు. పొడగరి; మర్యాద మన్నన తెలిసిన వాడు: ఉపాధ్యక్షుడు కాకముందు తన రాష్ట్రశాసన సభలలోనూ, సంయుక్త రాష్ట్రాల కాంగ్రెసులోనూ సభ్యుడుగా వున్నాడు; చెప్పుకోతగిన గొప్ప సామర్థ్యం లేని ఈ వ్యక్తి రాజకీయవేత్తల చేతిలో సులభమైన పరికరంగా వున్నాడు.

మిల్లర్డ్ ఫిల్మోర్ పశ్చిమ న్యూయార్కు రాష్ట్రంలో అప్పట్లో ప్రజానివాసంలేని ప్రాంతమైన కయుగకౌంటీ నుంచి వచ్చాడు. అతని ఇల్లు దారుకుటీరం; అతనితండ్రి కర్షకుడు. పదిహేనవయేట ఉన్ని నేతపనివాని వద్ద పని నేర్చుకోవడానికి చేర్చబడినాడు. ఫిల్మోర్ ఆశయాలు పెద్దవి; ఉన్ని పనివానికంటే పెద్దవాడు కావాలనే ఆకాంక్ష వుండేది. అబిగైల్ పవర్స్ అనే ఒక గ్రామపాఠశాలా ఉపాధ్యాయురాలి ప్రేమలో పడ్డాడు. ఆమె సహాయంతో చదువుసాగించాడు.

చదువుకోవడానికి సతమతమౌతున్న ఈ చిన్న వున్ని తేకు పనివానిని దయామయుడైన ఒక గ్రామ న్యాయాధికారి చూచాడు; ఉన్నిపని శిక్షణవ్యయం చెల్లించి, న్యాయశాస్త్రాభ్యాసానికి అవకాశం కల్పించాడు. మిల్లర్డ్ ఫిల్మోర్ ఆబిగైల్‌ను పెండ్లాడాడు; న్యాయాధికారి యైనాడు; రాజకీయాలలో ప్రవేశించాడు.

మిల్లర్డ్ ఫిల్‌మోర్ బానిస తనాన్ని ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూ వచ్చాడు. కాని, అధ్యక్షుడైన పిమ్మట రాజకీయ వేత్తలు ఎలా నడిపిస్తే అలా నడిచాడు. పారిపోయిన బానిసలమీదను వారి పరారికి తోడ్పడిన వారిమీదను చర్య తీసికొనే అంశముతో కూడిన 1850 సంవత్సరపు రాజకీయ చట్టంపై ఆయన సంతకంచేశాడు.



మిల్లర్డ్ ఫిల్మోర్ పెర్రీని జపానుకుపంపి,

యునైటెడ్‌స్టేట్సు వ్యాపారమునకు రేవుల అనుమతి సంపాదించటం ఆయన పరిపాలనలో జరిగిన శాశ్వతకార్యం.

వైట్‌హౌస్‌లో మొదటి గ్రంథాలయం ఆయన పరిపాలన కాలంలోనే నెలకొల్పబడింది. ఆయనకుమార్తె పట్టుదలచేత ఈ పని జరిగింది; ఆమెకూడ తన తల్లివలెనే ఉపాధ్యాయిని.

మిల్లర్డ్ ఫిల్మోర్ ప్రశాంతంగా జెకరీటైలర్ పదవీ కాలాన్ని పూర్తి చేశాడు. నాలుగేండ్ల తర్వాత స్వయంగా అధ్యక్షుని ఎన్నికలకు నిలచాడు కాని ఎన్నిక కాలేదు. ఆయన న్యూయార్కులోని బఫెలోలో చనిపోయాడు.



## ఫ్రాంక్లిన్ పియర్స్

### నల్లరాతి కొండల యువ హికోరీ

నవంబర్ 23, 1804 — అక్టోబరు 8, 1869

డెమోక్రాట్ — పధ్నాలుగవ అధ్యక్షుడు 1853 - 1857

మిల్లర్డ్ ఫిల్మోర్ తర్వాత న్యూ ఇంగ్లాండ్ వాస్తవ్యుడైన ఫ్రాంక్లిన్ పియర్స్ అధ్యక్షుడుగా ఎన్నుకోనబడినాడు. అతడు సుందరుడు, మందహాస వదనుడు; దక్షిణాది విధానాలు కల ఉత్తరాదిమనిషి. కాంగ్రెస్ సభ్యుడుగానూ సెనెటర్‌గానూ వున్నాడు; కాని అధ్యక్షుడు కావాలని ఎన్నడూ అనుకోలేదు. అతడు అజ్ఞాత అభ్యర్థి. అతని భార్య సిగ్గరి; నలుగురిలోకి రాదు; వైట్‌హౌస్‌లోకి రావాలని ఆమెకు లేనేలేదు.

ఫ్రాంక్లిన్ పియర్స్ హాంప్‌షైర్ రాష్ట్రంనుండి వచ్చాడు; ఆ రాష్ట్రానికి అతనితండ్రి గవర్నరుగా పనిచేశాడు. తండ్రి హొలంలో ఒక దారుకుటీరంలో అతడు పుట్టాడు - బౌడోయిన్ కాలేజీలో చదివాడు; పిమ్మట న్యాయవాదవృత్తి సాగించాడు. నాథేనియల్ హాథార్న్ అతని కాలేజీ సహాధ్యాయి; ఆమరణ మిత్రుడు కూడాను. స్నేహశీలుడైన ఫ్రాంక్‌పియర్స్ అంటే అందరూ మక్కువ చూపేవారు.

మెక్సికన్ యుద్ధకాలంలో అతడు బ్రిగేడియర్ జనరల్ పదవిని పొందాడు. యుద్ధభూమిలో గుర్రం పడవేస్తే గాయం తగిలింది. అతడు అధ్యక్షత పదవికి ఎన్నికల ప్రచారంచేసే సందర్భంలో ఆతని ప్రత్యర్థులు ఇలా ఎగతాళి చేశారు.

"అన్నారు మెక్సికోలో తన సైన్యాన్ని నడిపేటప్పుడు
అకస్మాత్తుగా మూర్ఛవచ్చి అశ్వంనుండి పడ్డాడని"

ఫ్రాంక్లిన్ పియర్స్ అధ్యక్షుడైనప్పుడు, బానిసలసమస్య కనీసం తాత్కాలికంగానైనా పరిష్కారమైందని ఆశించబడింది. కాని, ఆయన పరిపాలనా కాలంలో ఈ సమస్య మరల ఒక్కుమ్మడిగా బయటపడింది.



కాంగ్రెస్‌లో తీవ్ర వాదోపవాదాల అనంతరం "కాన్సాస్ - నెబ్రాస్కా చట్టం ఆమోదించబడింది. ఈ చట్టంద్వా ) నెబ్రాస్కాలలో బానిసతనానికి అనుమతి ఇవ్వబడింది. కాన్సాస్‌లో భయంకరమైనతగాదా చెలరేగింది;

హింసాకాండ, రక్తపాతం జరిగింది. ఎందుచేతనంటే, చాలా సంవత్సరాల క్రిందట ఆమోదించబడిన మస్సూరీ చట్టం ద్వారా ఈ ప్రాంతం 'శాశ్వతంగా బానిసతనంనుండి విముక్తి' పొందగలదని ప్రకటించబడి వున్నది.

తన పదవీకాలం తీరిన పిమ్మట ఫ్రాంక్లిన్ పియర్స్ న్యూ హాంప్షైర్‌కు తిరిగి వచ్చాడు. అతని దక్షిణాది సాను భూతిని ఉత్తరాది వా రంగీకరించకపోవటంచేత తిరిగి అధ్యక్ష అభ్యర్థిగా నియమించబడలేదు.

*

# జేమ్సు బుఖనన్

## సంక్షుభితాధ్యక్షుడు

ఏప్రియల్ 23, 1791 — జూన్ 1, 1868

డెమోక్రాట్ — పదిహేనవ అధ్యక్షుడు 1857 - 1861

అమెరికా చరిత్ర యందలి ఈ తీవ్ర సందిగ్ధ కాలంలో జేమ్సు బుకనన్ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. ఆయన ముఖ్యమైన అనేక ప్రభుత్వ పదవులలో పనిచేశాడు. లండన్‌లో అమెరికను మంత్రిగావుంటూ వుండటంచేత బానిసతనాన్ని గూర్చి చెలరేగిన జగడంలో ఆయన చిక్కుకోలేదు, అధ్యక్షుడుగా ఎన్నిక కావటానికి అది ముఖ్యహేతువు. బానిసతనం అమలులోవున్న రాష్ట్రాలలో జోక్యము చేసుకోరాదని ఆయన విశ్వాసం.

బుఖనన్ స్నేహశీలి; దయాశాలి; న్యాయవాది; రాయబారి; కాని అధ్యక్షుడుగామాత్రం పిరికివాడు, దుర్బలుడు, సముచితనిర్ణయ జ్ఞానశూన్యుడు. దేశానికి శక్తివంతుడైన నాయకుడు కావలసి వున్నాడు. నాలుగు సంవత్సరాలు చాలా సమస్యలు మన పధ్నాలుగవ అధ్యక్షుని ముందున్నవి.

అధ్యక్షుడు బుఖనన్ గృహనిర్వాహణకు అందగత్తెయైన తన మేనకోడలు హారియట్ లేన్‌ను వైట్‌హౌస్‌కు తీసుకువచ్చాడు. యువకుడుగా వున్నప్పుడు ఒక అమ్మాయిని ప్రేమించి వంచించబడ్డాడు. తర్వాత బుఖనన్ పెండ్లి చేసుకోనేలేదు.

జేమ్సు బుఖనన్ పెన్సిల్వేనియాలో జన్మించాడు. అతని తండ్రి ఐర్లాండునుండి వచ్చాడు; పెన్సిల్వేనియా పర్వతాలలోని ఒక వలసలో స్టోనీ బాట్టర్‌లో దారుకుటీరం నిర్మించుకొన్నాడు; సంపన్నుడైనాడు; కొడుకును డికిన్సన్ కాలేజీకి పంపగలిగాడు. ఇరవై ఒకటవ ఏట బుఖనన్ సిపాయిగా చేరి మెక్సికన్ యుద్ధంలో పనిచేశాడు. యుద్ధంనుండి తిరిగివచ్చి రాజకీయాలలో ప్రవేశించాడు.

బుఖనన్ పరిపాలనా కాలంలోనే అట్లాంటిక్ సముద్రంలో కేబిలు వెయ్యబడింది. ఇంగ్లాండురాణి విక్టోరియా మొదటి కేబులుగ్రాంను ప్రెసిడెంట్ బుఖనన్‌కు పంపింది.



యునైటెడ్ స్టేట్సుకు జపాను రేవుల అనుమతి కోసం కమాండోర్ పెర్రీ నడిపిన రాయబారం ఫలించింది. వాషింగ్‌టన్‌లో జపాను రాయబారవర్గాన్ని బుఖనన్ స్వీకరించాడు.



అతని పరిపాలనా కాలమంతా యునైటెడ్ స్టేట్సుపై భయంకరమైన కారుమబ్బులు క్రమ్మివున్నాయి.

ఈ కాలంలోనే బానిసల సమస్య తీవ్రరూపం దాల్చింది. ఈ సమస్యవల్ల ఉత్తర, దక్షిణ ప్రాంతాలు రెండుగా విడిపోసాగినవి. బానిసతనాన్ని రద్దుచేయటానికి కాంగ్రెసుకు అధికారం లేదని డ్రెడ్‌స్కాట్ నీగ్రో కేసులో యునైటెడ్‌స్టేట్సు సుప్రీం కోర్టు తీర్పుచెప్పింది. మరొక బానిసలరాష్ట్రం కాన్సాసును యూనియన్‌లోనికితీసుకురావటానికి కాంగ్రెసుప్రయత్నించింది. బానిసతనం రద్దుకావాలనే తీవ్ర విశ్వాసంకల జాన్ బ్రౌన్ అనే వ్యక్తి వర్జీనియాలో తనంత తాను స్వతంత్రించి, కొందరు అనుచరులతోకలసి, బానిసలను యజమానులపై తిరుగుబాటు చేయటానికి ప్రోత్సహించాడు; దాని కతడు ప్రాణ మర్పించాడు; జాన్ బ్రౌన్ ఉరితీతతో దేశమంతా రెచ్చిపోయింది.

ఈ సంకటకాలమంతా వైట్‌హౌస్‌లోని దిగ్భ్రాంతి వ్యక్తి డోలాయమానుడై ఏమీ చెయ్యలేదు.

ప్రెసిడెంటు బుఖనన్ పదవీకాలం గడువు దగ్గరపడే టప్పుడు నూతన రిపబ్లిక్ పార్టీ చికాగోనందలి విగ్వాంలో సమావేశమై తర్వాతి తమ అధ్యక్ష అభ్యర్థిని నిర్ణయించుకొన్నారు. బానిసతనం విస్తృతికి ప్రబల విరోధియైన స్ప్రింగ్‌ఫీల్డ్ న్యాయవాది అబ్రహాంలింకన్‌ను వారు అభ్యర్థిగా నిర్ణయించారు.

తర్వాతి అధ్యక్షుడు అబ్రహాం లింకను అని నిర్ధారణ కాగానే దక్షిణ కెరొలీనా యూనియన్‌నుండి ఉపసంహరించుకొన్నది. మరి ఆరురాష్ట్రాలు దాని ననుసరించాయి. అమెరికా సంయుక్తరాష్ట్రాల సమాఖ్య ఇప్పుడు పటాపంచలైంది.

'కాన్‌ఫెడరేట్ స్టేట్సు ఆఫ్ అమెరికా' అనే పేరుతో దక్షిణ రాష్ట్రాలు ఒక యూనియన్‌గా ఏర్పడ్డాయి; జెఫర్సన్ డాలీస్‌ను తమ అధ్యక్షుడుగా ఎన్నుకొన్నాయి; అతడు సైనికుడు; చాలా తెలివిగలవాడు; వాషింగ్‌టన్‌లో మిసిసిపీ సెనెటర్‌గా వున్నాడు. ఈ సమాఖ్యకు రిచ్‌మండ్ నగరము రాజధాని యైనది.

అసుఖప్రదమైన నాలుగేండ్ల పదవీకాలానంతరం జేమ్సు బుఖనన్ పెన్సిల్‌వేనియాలోని తన వీట్‌లాండ్ గృహానికి విశ్రాంతికై వెళ్ళాడు. అక్కడే ఏడేండ్ల తర్వాత అతడు మరణించాడు. అంతఃకలహాలతో విభక్తమైన ఈ మహాదేశపు శోకగాథ, తర్వాతి అధ్యక్షుడైన అబ్రహాంలింకన్ విశాల, సమర్థ హస్తాలలో వుంచబడింది.

★

# అబ్రహాం లింకన్

## నీతిశాలి ఏబ్

ఫిబ్రవరి 12, 1809 — ఏప్రిల్ 15, 1865

రిపబ్లికన్ — పదహారవ అధ్యక్షుడు 1861-1865

1861 పదవీస్వీకరణ దినాన, సంయుక్త రాష్ట్రాల పదహారవ అధ్యక్షునికి స్వాగతం పలకడంకోసం, గంభీరవదనులైన ప్రజలు కాంగ్రెస్ భవనం ముందు గుమిగూడి వున్నారు. పురోగాములతో పెరిగిన అబ్రహాంలింకన్ పొడవుగా, బక్కపలుచగా నల్లటిసూటు, ఎత్తయిన హాటు వేసుకొని, ప్రశాంతంగా, గంభీరంగా మాట్లాడాడు.

ఇంతకు ముందే బానిసవిధానం నెలకొనివున్న రాష్ట్రాల లోని బానిసతనం విషయంలో జోక్యం చేసుకోనని అతడు దక్షిణాదికి హామీ ఇచ్చాడు. కాని, యూనియన్‌నుండి ఉపసంహరించుకునే హక్కు ఏ రాష్ట్రానికీ వుండదనీ, యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వాన్ని పదిలపరచి, కాపాడి; రక్షించుటకు తాను పరమ పవిత్ర ప్రమాణం స్వీకరిస్తున్నాననీ ప్రమాణంచేశాడు.

సామాన్య 'పురోగామి' దంపతులైన టాం, నాన్సీ హాంక్సీ లింకన్‌లకు కెంటకీ యందలి హాడ్జెన్‌వెల్లీ దగ్గర అబ్రహాంలింకన్ పుట్టాడు. అతని ఇల్లు ఒంటరిగా వుండేది; మట్టినేల, చర్మపుకీళ్ళతలుపుగల కచ్చాఇల్లు. అతని ప్రక్కమీద

ఎలుగుచర్మాలు పరచివుండేవి. అతని తాత ఇండియనులచేత చంపబడ్డాడు.

టాంలింకన్, భార్యతోనూ, పిల్లలు సారా, చిన్న ఏబ్ లతోనూ ఇండియానాకు తరలి, అక్కడ మరల నేలబాగుచేసి కొని, కుటీరం కట్టుకొన్నాడు. ఇక్కడ ఏబ్ తొమ్మిదవయేట తల్లి మరణించింది.

టాంలింకన్ మళ్ళీ పెండ్లిచేసుకొన్నాడు. వదులైనతోలు



చల్లడము, కూన్ చర్మము టోపీ, వేసుకొని, అందవికారంగా వుండే మొరటు ఏబ్ మీద సవతి తల్లికి వాత్సల్యం ఏర్పడింది. ఈ పిల్లవాడు తన మంచి చెడ్డలు తాను చూచుకోగలగటమే కాక అవసరమైతే పోరాడ గలడుకూడా. పొలంలో ధాన్యంచల్లగలడు; దుక్కి దున్నగలడు; కార్మికులతో పాటు దూలాలునరకగలడు.

ఐనప్పటికి అతడు సాధు వర్తనుడు, దయార్ద్ర హృదయుడు కూడాను. ఏబ్ కూ దక్కిన బాలురకు పోలికేలేదు.

ఒక సంవత్సరానికి తక్కువకాలం బడికి వెళ్ళాడు; కాని, పుస్తకాలు అరువు తెచ్చుకోవటానికి మైళ్ళకొలది నడిచి వెళ్ళేవాడు.

పంధొమ్మిదవ యేటికి సన్నగా వాసంలాగా, ఆరు అడుగుల నాలు గంగుళాల పొడవున, బలంగా, మొరటుగా తయారయ్యాడు.

అతడు సమర్థుడు, నిర్భయుడు. పంధొమ్మిదవయేట సరుకులునింపిన బల్లపరుపు పడవను భయంకరమైన ఓహియో మిసిసిపీనదులగుండా న్యూ ఓర్లియన్సుకు తీసుకుపోయాడు.

ఇల్లినాయిస్‌లోని న్యూ సాలెం అనే చిన్నగ్రామంలో లింకన్ నివాస మేర్పరచుకొన్నాడు. దుకాణదారుగానూ, కార్మికుడుగానూ, టోపీని ఉత్తరాల సంచిగా ఉపయోగిస్తూ పోష్టు మాష్టరుగనూ పనిచేశాడు. చేతికందిన పుస్తకమల్లా చదువుతూ అధ్యయనంచేస్తూ, స్వప్నాలుకంటూ దుకాణాన్ని నిర్లక్ష్యం చేశాడు. న్యాయశాస్త్ర గ్రంధాలు నమిలి మ్రింగాడు; న్యూసాలెం ప్రజలకు అతడంటే ఎంతో ప్రీతి; అతడు చేసే వేళాకోళాలు, చెప్పేకథలు వినటానికి చుట్టూ చేరేవారు. అతడు కథలు చాలా బాగా చెప్పేవాడు.

దేశవ్యవహారాలనుగూర్చి గాఢంగా యోచిస్తూ వుండేవాడు. అన్యాయాన్ని ద్వేషించేవాడు; బానిసవిధానం తప్పనీ

పాపమని అతనిభావం. రాజకీయాలలో చొరబడ్డాడు; రాష్ట్రి శాసనసభలో ఏనిమిదేండ్లు సభ్యుడుగావున్న తర్వాత ఇల్లినాయిస్ నందలి స్ప్రింగ్‌ఫీల్డులో సామాన్య న్యాయవాది కార్యాలయాన్ని నెలకొల్పాడు. సంచారన్యాయవాదిగా న్యాయవిచారణ జరిగిన చోటికల్లా, ఒక చిన్న ఊరినుండి మరొక వూరుకు గుర్రంమీద ప్రయాణం చేస్తూవుండేవాడు. ఆయన నిష్పక్షపాతం, న్యాయం చూచి, ప్రజ లతనిని "నీతిశాలి ఏబ్" అని పిలిచేవారు.

కాంగ్రెస్‌లో ప్రతినిధిగా వున్నపిమ్మట, ఈ క్రొత్త జిల్లాల న్యాయవాది యునైటెడ్ స్టేట్సు సెనేటు ఎన్నికలకు, నాగరికుడు; అనుభవశాలియైన స్టీఫెన్ డగ్లస్‌కు ప్రత్యర్థిగా నిలచాడు. ఇరువురు అనేక సంయుక్త వాగ్వాదములలో బాని సలసమస్యను చర్చించుతుండగా వినటానికి ప్రజలు గుంపులు కూడుతుండేవారు. వార్తాపత్రికలు ఈ ఉపన్యాసాలను దేశం నలుమూలలకు మోసుకుపోతుండేవి. సెనెట్ ఎన్నికలో లింకన్ ఓడిపోయాడు. కాని అమెరికా ప్రజలు ఏబ్‌లింకన్‌ను, అతని ఆశయాలను అర్థంచేసికోవటం నేర్చుకొన్నారు. రెండేండ్ల తర్వాత అతడు అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. దక్షిణరాష్ట్రాలు యూనియన్‌నుండి ఉపసంహరించుకొంటూ వుండటంతో, అంత ద్విభక్తమైన ఒకదేశానికి లింకన్ అధిపతియైనాడు.

వానపడుతున్న ఆ చల్లని ఉదయాన వాషింగ్‌టన్‌లో పదవీ స్వీకరణకై స్ప్రింగ్‌ఫీల్డునుండి వచ్చినప్పుడు, తనముం



డున్న కఠినకార్యం ఎంత మహత్తరమైనదో అబ్రహాంలింకన్‌కు బాగా తెలుసును. రైలుబండివెనుక ప్లాట్‌ఫారంమీద, భుజాలపై శాలువా కప్పుకొని, నల్లని గుబురుగడ్డంతో ఒంటరిగా నిలుచున్నాడు.

తా నిక తిరిగి రాలేనని తోచి స్నేహితులవద్ద ఇరుగు పొరుగువారివద్ద సెలవు తీసికొన్నాడు. హేరిన్‌బర్గ్‌వద్ద తనను చంపటానికి కుట్ర జరుగుతుందని హెచ్చరించబడి, ప్రయాణానికి ప్రత్యేకంగా వేయబడిన, రైలును విడిచిపెట్టి, ఒక అంగరక్షకుడు ఒక గూఢచారి వెంట రాగా వాషింగ్‌టన్‌కు బయలుదేరాడు.

లింకన్ వైట్‌హౌస్‌లో ప్రవేశించిన ఆరువారాల అనంతరం చార్లెస్టన్ రేవునందలి ప్రభుత్వ వశమం దున్న ఫోర్ట్‌సంటన్ కోటపై కాన్‌ఫెడరేట్ ఫిరంగులు కాల్పులుచేసినవి.

ఉత్తర, దక్షిణ ప్రాంతాలకు యుద్ధ మారంభమైంది. యుద్ధంలో విజయసాధన ఒకటే యూనియన్‌ను రక్షించగలదని ఇప్పుడు అధ్యక్షుడు లింకన్ గుర్తించి, సైనికులు కావాలని ప్రకటించాడు. దేశాధినేతగా నాలుగేండ్ల భయంకర యుద్ధకాలంలో అధ్యక్షుడు లింకన్ ఎన్నడూ ధైర్యంగానీ, విశ్వాసంగానీ కోల్పోలేదు. చంపుతామని బెదరించారు; కాని ఆయన చలించలేదు.

యూనియన్‌పై యుద్ధంచేస్తున్న రాష్ట్రాలలోని బానిసలకు స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తూ అతడు "విముక్తి ప్రకటన" ను జారీచేశాడు. ఈ చర్యద్వారా వేలకొలది నీగ్రోలు స్వతంత్రులైనారు. యునైటెడ్ స్టేట్సులో శాశ్వతంగా బానిసత్వాన్ని రద్దుపరుస్తూ రాజ్యాంగానికి పదమూడవ సవరణ ఆమోదించబడింది.

ఈ యుద్ధంలో జరిగిన మహాభయంకరమైన పోరాటాలలో ఒకటి గెట్టిస్‌బర్గు వద్ద జరిగింది. ఈ రణరంగం సమర్పణ మహోత్సవంలో అధ్యక్షుడు లింకన్ అమెరికా ప్రజలెన్నటికీ మరచిపోని ఈ చిన్న మాట లన్నాడు. "ఇక్కడ మనం మహోన్నత నిర్ణయంచేస్తున్నాము - ప్రజలకొరకు, ప్రజలచేత ప్రజల ప్రభుత్వం ప్రపంచంనుండి మాసిపోదు."

ఈ అంధకారబంధుర, వ్యాకుల దినాలలో వైట్‌హౌస్ వంచని, విరామ మెరుగని, బడలిపోయిన ఆ వ్యక్తి దయామయమైన ముఖం చింతాక్రాంతమైపోయింది; జీర్ణమైపోయింది. ఆ అగాధహృదయుడు తన దేశంతోపాటు, తన ప్రజలకొరకు కష్టా లనుభవించాడు. తన ఇద్దరు కుమారులతో, వారి చెలికాని



వలె, వారితో ఆట లాడుతూ గడపిన సమయాలే ఆయన సుఖ సమయాలు. పెద్దకుమారుడు లిల్లీ చనిపోయిన తర్వాత సమస్త వాత్సల్యమూ శ్రద్ధ చిన్నకుమారునిపై ప్రసరింపచేశాడు. చిన్న కుమారుడు టాడ్ అల్లరివాడు, తుంటరి.

యుద్ధం ముగిసేకాలంలో రెండవసారి అధ్యక్షుడుగా అబ్రహాం లింకన్ తిరిగి ఎన్నుకొనబడినాడు. తన ద్వితీయ

పదవీ స్వీకరణోపన్యాసంలో దేశానికి తగిలిన గాయాలను మాన్పుకోవలెననీ, ధర్మసంబద్ధమైన శాశ్వతశాంతికై కృషి చేయవలెనని ప్రజల నర్థించాడు. 'ఎవరిపట్ల' క్రోధంలేకుండా అందరిపట్ల ఔదార్యంతో, సత్యాన్ని దర్శించటానికే భగవంతుడు మనలను పుట్టించాడు. కనుక సత్యపథంలో సుస్థిరులమై, మనం నిర్వహిస్తున్న కార్యాన్ని సంపూర్తి చేయుటానికి కృషి చేసెదము గాక : ”

అతడు తిరిగి ఎన్నికయైన ఒకనెలతర్వాత కాన్ఫెడరేట్ జనరల్ ఇ. వి. లొంగిపోయాడు. ఇతర కాన్ఫెడరేట్ సైన్యాలు అతని ననుసరించినవి; యుద్ధంసమాప్తమైంది. దక్షిణరాష్ట్రాలలో పునర్నిర్మాణమునకై తన ప్రణాళికలు అమలు పరచకుండానే ప్రెసిడెంట్ లింకన్ మరణించాడు. ఏప్రిల్ 14, 1865 గుడ్ ఫ్రైడే సాయంత్రం, యుద్ధ ంసమాప్తమయిం దన్న సంతోషంతో అధ్యక్షుడు, ఆయనభార్య, ఇద్దరుస్నేహితులతో ఫోర్డ్ నాటకశాలకు వెళ్ళారు. నాటకం జరుగుతుండగా. దక్షిణాది సాను భూతిపరుడైన నటకుడు జాన్‌విల్‌కిన్‌బూత్ చప్పుడుకాకుండా అధ్యక్షుడు కూర్చున్న ఆవరణలోనికి ప్రవేశించాడు. ఒకచేత చురకత్తి, మరొకచేత పిష్టలు పూని అధ్యక్షుని వెనుకకువచ్చి కాల్చాడు. తాను కూర్చొనివున్న ఎత్తయిన అనుడుగల ఊగుడు కుర్చీలో లింకన్ ముందుకు కూలిపోయినాడు. రెండవనాటి ఉదయం అధ్యక్షుడు లింకన్ మరణించాడు.

అధ్యక్షుని మరణానికి దేశం యావత్తు శోకించింది. ఆయన భౌతికదేహాన్ని స్ప్రింగ్‌ఫీల్డుకు కొనిపోయేరైలు గ్రామ సీమలగుండా నెమ్మదిగా నడుస్తూవుండగా, పొలాలలోని కార్మికులు టోపీలుతీసి, తలలువంచి నిలిచారు. ఒకదేశాన్ని పదిలపరచి ఒకజాతికి స్వేచ్ఛ ప్రసాదించిన ఆ మహావ్యక్తి ఇక లేదు.



# ఆండ్రూ జాన్సన్

## అధ్యక్షుడైన ఉపాధ్యక్షుడు

డిశెంబరు 29, 1808 — జులై 31, 1875

రిపబ్లికన్ — పదిహేడవ అధ్యక్షుడు 1865—1869

ప్రెసిడెంట్ లింకన్ విషాద మరణానంతరం కొన్ని గంటల తర్వాత, ఆండ్రూ జాన్సన్ వాషింగ్టన్‌లో తాను నివసిస్తున్న హోటలు కచేరీ గదిలో యథావిధిగా అధ్యక్ష ప్రమాణం స్వీకరించాడు. ఒక నెలమాత్రమే ఆయన ఉపాధ్యక్షుడుగా పనిచేశాడు. దక్షిణాదివారు ఓడిపోయినప్పటికినీ బానిస విధానాన్ని ధైర్యంగా ఎదిరించి నిలిచాడు. ప్రెసిడెంట్ లింకన్ అతనిని టెన్నెసీ మిలిటరీ గవర్నరుగా నియమించాడు. లింకన్ రెండవపర్యాయము అధ్యక్షుడుగా ఎన్నికైనప్పుడు అతడు ఉపాధ్యక్షుడైనాడు.

ఆయన టెన్నెసీ పర్వతపు ప్రాంతపువాడు; సాధారణ వ్యక్తిలాగా కన్పిస్తాడు. బలమైన ఆకృతి, లోతుకళ్ళు, జీర్ణ ముఖం; జంకులేని మనిషి; కల్లకపటం లేనివాడు. కాని మహానుభావుడైన అబ్రహాం లింకనుకున్న గ్రహణశక్తి, వివేకం, క్షమ ఆయనకు లేవు.

ఉత్తరకెరొలినాలోని రాలీలో ఆండ్రూ జాన్సన్ పుట్టాడు. అతని తల్లిదండ్రులు రాలీలోని సారాయంగడిలో పనిచేస్తూవుండే



వాళ్ళు. తండ్రి చనిపోయాడు. పదేళ్ళవయస్సప్పుడు ఆండ్రూ ఒక దర్జీవానివద్ద పని నేర్చుకోవటానికి చేర్చబడ్డాడు. పదహారేళ్ళప్పుడు ఈ పిల్లవాడు తన శిష్యరికాన్ని విడిచి పారిపోయాడు. పర్వతాలుదాటి టెన్నెసీకి వెళ్ళాడు; అక్కడ, గ్రీన్‌విల్లీ అనే చిన్న పట్టణంలో స్వంతంగా దర్జీదుకాణం పెట్టుకున్నాడు పంధొమ్మిదవయేట పెండ్లిచేసుకొన్నాడు; అతని చిన్నారిఇల్లాలు అతనికి చదువను వ్రాయను నేర్పింది.

గ్రీన్‌విల్లీ రైతులు, కార్మికులు అతని స్నేహితులు; వాళ్ళంతా దర్జీదుకాణంలోతరచుకూడి రాజకీయాలు మాట్లాడుకొనే వారు. ఆండ్రూ జాన్సన్ ధారాళంగా మాట్లాడేవాడు; అతడు వాళ్ళ నాయకుడైనాడు ఆ సరిహద్దు పట్టణానికి ముందు ఎల్డర్‌మాన్, తర్వాత మేయరై తర్వాత అత్యున్నతరాజకీయ పదవి అధిష్ఠించాడు.

తాను దర్జీగా తక్కువస్థాయిలో జీవిత మారంభించిన సంగతి ఆయన ఎన్నడూ మరచిపోలేదు. చిన్నతనంలో కమ్మరి దుకాణంలోపనిచేసిన ఒకమిత్రుడు తాను స్వయంగా తయారు చేసిన ఒక పటకాదు, ఒక పార, ఆండ్రూ జాన్సన్ టెన్నెసీ గవర్నరుగా ఎన్నికైనప్పుడు బహూకరించాడు. గవర్నరు జాన్సన్ రాత్రివేళల పనిచేసి మంచి ఉన్నిగుడ్డ కత్తిరించి, సూటుకుట్టి, సగర్వంగా తన స్నేహితునకు బహూకరించాడు; ఆ స్నేహితుడు ఒక జడ్జి.

జాన్సన్ అధ్యక్షుడైనప్పుడు, కాంగ్రెస్ అప్పటికే దక్షిణరాష్ట్రాల పునర్నిర్మాణానికి లింకన్ సిద్ధపరచిన ఉదార పథకాలపట్ల తీవ్రతర వ్యతిరేకత చూపుతున్నది. ఈ పథకాలను అమలుపరచటాని కతడు కృతనిశ్చయుడైనాడు. ఆరంభంనుండి కాంగ్రెసుకూ ఈ తొందపాటు అధ్యక్షునకూ పొసగలేదు.

అధ్యక్షుని అదుపులో పెట్టడంకోసం, పదవీకాలపు చట్టాన్ని ఒకదానిని కాంగ్రెస్ ఆమోదించి, ఉన్నతాధికారులను పదవులనుండి బర్తరఫ్ చేయగల అధ్యక్షుని హక్కును లాగి వేసింది. ఈ చట్టం రాజ్యాంగ విరుద్ధమని ప్రెసిడెంట్ జాన్సన్ నమ్మి, తనను అడుగడుగుకు వ్యతిరేకిస్తూవచ్చిన యుద్ధకార్య దర్శిని బర్తరఫ్ చేయూ లని పట్టుబట్టాడు. కాంగ్రెస్ నిరాక రించింది; కాంగ్రెస్ ప్రెసిడెంటులమధ్య అభిప్రాయభేదాలు ఎంత తీవ్రంగా పెరిగినవంటే-అమెరికా చరిత్రలో ప్రథమ పర్యాయంగా అధ్యక్షుడు అభిశంసలకు లోనయ్యాడు. సెనేట్ హక్కుల పరి

రక్షణాధికారి అభిశంసన తాఖీదును ప్రెసిడెంట్ జాన్సన్‌కు జారీచేశాడు. సెనేట్‌లో విచారణ జరుగుతున్నప్పుడు దేశం యావత్తు అట్టుడికి పోయినట్లుడికిపోయింది. ఓటు తీసికొనబడి నప్పుడు ఒక ఓటు ఎక్కువ రావటంచేత ఆండ్రూ జాన్సన్ శిక్ష తప్పించుకొన్నాడు.

తన తర్వాత అధ్యక్షుని ప్రమాణస్వీకారమునాడు, సడి చప్పుడులేకుండా వైట్‌హౌసేను వదలి గ్రీన్‌విల్లీలోని తనఇంటికి వెళ్ళాడు. కాని, ఏడేండ్ల పిమ్మట, భక్తిపరాయణులైన తన టెన్నెసీ స్నేహితులచేత సెనెటరుగా ఎన్నుకొనబడి వాషింగ్‌టన్‌కు తిరిగి వచ్చాడు. అధ్యక్షుడుగా తాను విచారించబడ్డ సెనేట్ భవనంలోనే సభ్యుడుగా కూర్చున్నాడు. ఈ రాజకీయ పదవికి తిరిగి చేరుకొన్నపిమ్మట నాలుగు నెలలే ఆయన జీవించాడు. నిర్భయుడు, దృఢసంకల్పుడు ఐన ఆండ్రూ జాన్సన్ నిజాయితీని, నీతిని అతని శత్రువులుకూడ ఎన్నడూ శంకించలేదు. ★



# యులిసెస్ ఎస్. గ్రాంట్

## విజయం సాధించిన సేనాని

ఏప్రిల్ 27, 1822 — జూలై. 3,1885

రిపబ్లికన్ — పద్దెనిమిదవ అధ్యక్షుడు 1869-1877

రాష్ట్రాల అంతర్యుద్ధంలో విజయం సాధించిన సేనాని యులిసెస్ గ్రాంట్, ఆండ్రూ జాన్సన్ తర్వాత అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. తన యుద్ధనైపుణ్యంచేత, దృఢ సంకల్పంచేత యుద్ధాన్ని కడముట్టించినవాడుగా అతడు కీర్తిగడించాడు. అధ్యక్షుడు కాకపూర్వం ఆయన ఏ రాజకీయ పదవులలోనూ పనిచేయలేదు. యుద్ధరంగంలో అతడు భయంకరుడు; కనికరమన్నది ఎరుగడు. వ్యక్తిగతంగా సిగ్గరి; మితభాషి; సాధువు; స్నేహపాత్రుడు. పొట్టిగా, బొద్దుగా, గుబురు గడ్డంతో వుండే ఈ జనరలు నోట చుట్టలేకుండా కనిపించేవాడు కాడు.

తన పదవీ స్వీకరణ దినాన, కాంగ్రెస్‌భవనానికి ప్రమాణ స్వీకారం కొరకు అధ్యక్షశకటంలో వెళ్తున్నప్పుడు, ఆచార ప్రకారం, పదవీ విరమణచేసే అధ్యక్షుడాయన ప్రక్కన ఆసీనుడై లేడు. ఆండ్రూజాక్సన్‌తోపాటు బండిలో ప్రయాణం చెయ్యటానికి జనరల్ గ్రాంట్ నిరాకరించాడు.

ఓహియోనది ఒడ్డున పాయింట్ ప్లెసెంట్ అనే ఒక గ్రామంలో యులిసెస్‌గ్రాంటు జన్మస్థలము. అతని తండ్రి-చర్మ

కర్మాగారం యజమాని; చిన్న యులిసెస్ ఓక్ చెట్లపట్టను ఒలవటం, తోళ్ళపట్టను ఒలవటం నేర్చుకొన్నాడు; బుద్ధిమంతుడు, బలశాలి యైన ఈ బాలునికి గుర్రాలంటే తగని మమకారం. ఏడేండ్లప్రాయంలోనే గుర్రాలమందను తోలేవాడు; అంత చిన్నతనంలోనే ఒక పెట్టెమీదనో లేక కొలబుట్టమీదనోఎక్కి-గుర్రం వీపుమీద జీను పడవేసేవాడు. అతని తండ్రి అనేవాడు; "వాడు దేనినైనా సరే స్వారి చెయ్యాలనుకొన్నాడా, చేశాడన్నమాటే."



యులిసెస్ పదిహేడవ యేట తన కిష్టం లేకపోయినా తండ్రికోరికపై వెస్ట్ పాయింట్ లో చేరాడు. పట్టభద్రుడైన వెంటనే మెక్సికన్ యుద్ధంలో చేరాడు; కాని కొలదిఏండ్ల తర్వాత సైనికోద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. సేద్యం చేసి చూచాడు; చర స్థిరాస్తుల క్రయ విక్రయం చేశాడు; దుకాణం నడిపాడు; ఏదీ కలిసి రాలేదు. ప్రెసిడెంట్ లింకన్ సైనికులు కావాలని ప్రకటిం

చినప్పుడు గ్రాంటు తన సోదరుని తోళ్ళ దుకాణంలో పనిచేస్తున్నాడు. వెంటనే వెలిసి పోయిన తన నీలపు యూని ఫారంను వేసుకొన్నాడు; యూనియన్ సైన్యంలో చేరాడు.

యుద్ధం అతనికి ఇష్టంలేదు. యుద్ధం వదలిపోవాలంటే గట్టిగా దెబ్బకొట్టాలి, ఎన్నటికీ విడిచిపెట్టకూడదు, అని అతని అభిప్రాయం.

యుద్ధంలో విజయం సాధించేవట్ల ఆయన కనికరం విడిచిపుచ్చాడు. అతనికి సంకల్పబలంవుంది; లోకజ్ఞానంవుంది; యుద్ధతంత్రంలో నైపుణ్యంవుంది. ఆ నాలుగేండ్లపాటు భయం కరయుద్ధం జరిగింది. గ్రాంటు యూనియన్ సైన్యాల కన్నిటికి సర్వ సైన్యాధ్యక్షుడైనాడు.

దక్షిణరాష్ట్రాల మహాసేనానియైన రాబర్ట్ ఇ. లీ. తుట్ట తుదికి తప్పనిసరిగా లొంగిపోయాడు. రిచ్‌మండ్ దగ్గర అప్పొ మొట్టాక్స్‌కోర్టు భవనంలో ఇద్దరు సేనానులు కలిశారు; లాంఛ నంగా లొంగుబాటు జరిగింది. పరాజితులైన బూడిదరంగు దుస్తుల సైనికుల ధైర్యసాహసములను గ్రాంట్ గాఢంగా గౌర వించాడు. నిర్మానుష్యమైన ఆ రాష్ట్రాలలో వసంతకాలపు దుక్కికి గుర్రాలు కావలెను కనుక తమ గుర్రాలను తమవద్దనే ఉంచుకొనవచ్చునని దక్షిణసైనికులకు అనుమతి ఇచ్చాడు. లొంగుబాటు జరిగిన తర్వాత, గ్రాంటు మౌనంగా, చింతా



క్రాంతుడై తన గుడారానికి తిరిగి వచ్చాడు. విజయంలోకూడా యుద్ధంపట్ల అతనికి ప్రేమలేదు.

గ్రాంటు అధ్యక్షుడైనప్పుడు దక్షిణరాష్ట్రాల పునర్నిర్మాణానికి, యుద్ధానంతర మాంద్యానికి సంబంధించిన తీవ్రసమస్యలను సంబాళించవలసి వచ్చింది. కాని, ఈ మహావీరుడు పరిపాలనా దక్షుడు కాడు. ఉదారబుద్ధితోనేకాకుండా, చిన్నపిల్లలు నమ్మినట్లు నమ్మి తన స్నేహితులను, చుట్టాలను ప్రభుత్వ పదవులలో పెట్టాడు. కుట్రలు, అవినీతి ప్రబలిపోయినవి. గ్రాంటు రెండు పదవీకాలాలపాటు అధ్యక్షుడుగా వున్నాడు; మూడవ పర్యాయముకూడ వుండాలని కోరేవాడేగాని, అధ్యక్షుడుగా అతడు దేశీయుల విశ్వాసం కోల్పోయాడు.

వైట్‌హౌస్‌ను విడిచివెళ్ళిన తర్వాత అతడు ప్రపంచ సంచారం చేశాడు; అటుపిమ్మట న్యూయార్కు నగరంలోని ఒక కమిషనువ్యాపారంలో భాగస్థుడుగా చేరాడు; వర్తకం దివాళా తీసింది. భగ్నహృదయుడైన ఈ వృద్ధసేనాని, తన స్వీయ చరిత్ర వ్రాస్తూ, రోగంతో, దరిద్రంతో చివరిరోజులు వెళ్ళబుచ్చాడు. న్యూయార్కులో హడ్సన్‌నది కెదురుగా రివర్‌సైడ్ డ్రైవ్ దగ్గర గ్రాంటు సమాధి చేయబడ్డాడు. అతని సమాధి ముందు అతనిమాటలే వ్రాయబడినవి. "మనకు శాంతి లభించుగాక."



# రూథర్‌ఫర్డ్ హేస్

## హేస్ అవ్వ

అక్టోబరు 4, 1822 జనవరి 17, 1893

రిపబ్లికన్ పంథొమ్మిదవ అధ్యక్షుడు 1877 - 1881

ప్రెసిడెంట్ గ్రాంట్ రెండవ పదవీకాలం కడబడేటప్పటికి, వివిధ ప్రభుత్వశాఖలలో కన్పించిన అవినీతిని చూచి యునైటెడ్‌స్టేట్సు ప్రజలు ఆందోళన చెందారు. ఈ పరిస్థితులను చక్కదిద్దగల అధ్యక్షుని కోరారు.

పంథొమ్మిదవ అధ్యక్షుడు ఐన రూథర్‌ఫర్డు హేస్ త్రీవ లోపంతో వైట్‌హౌస్‌లో అడుగుపెట్టాడు. అతని ఎన్నిక వివాద గ్రస్తమైంది. ఎన్నికలో పోటీ చాలా తీవ్రంగావుంది; ఎన్నిక జరిగేనాటి రాత్రి, తాను ఓడిపోయినానని నిశ్చయించుకొని రిపబ్లికన్ అభ్యర్థిగా నిలచిన రూథర్‌ఫర్డు హేస్ నిద్రపోవటానికి వెళ్లాడు. ఎన్నికల ఫలితాలలో జరిగిన లోపాలవలన ఉభయ పక్షాలు గెలుపు తమదేనని వాదించారు. ఎవరు గెలిచారో నిర్ధారణ చెయ్యటానికి ఒక ప్రత్యేక విచారణసంఘం ఏర్పాటు చెయ్య బడింది. ఈ విచారణసంఘం రూథర్‌ఫర్డుహేస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినట్లు ప్రకటించింది. పదవీ స్వీకారోత్సవానికి రెండు రోజులు ముందు ఈ సమస్య పరిష్కారమైంది. హేస్ స్వగృహం నుండి వాషింగ్‌టన్‌కు ప్రయాణమైనప్పుడు తాను

అధ్యక్షు డౌతాడో కాదో తనకే తెలియదు. అతడు వైట్‌హౌస్‌లో ప్రవేశించాడు. కాని, ఈ ఎన్నిక న్యాయంగా జరగలేదని కొందరు భావించారు.

ఈ రూథర్‌ఫర్డ్ హేస్ ఓహియో గవర్నరుగా వున్నాడు. నీతి, నిజాయితీ కలవా డని పేరుపొందాడు. అతడు పరువుమర్యాదలు కలవాడు. స్నేహపాత్రుడు, దయకలవాడు; పొడవుగావుండే వాడు, పొడవాటి గుబురుగడ్డం, మీసా లుండేవి. పరిస్థితులను చక్కబరచాలనే ఆయన ప్రతీక్షణనుబట్టి, ఆయన నిరాడంబర జీవిత విధానమునుబట్టి ఆయన ప్రత్యర్థులు "అతిమంచిమనిషి" అనీ "హేస్ అవ్వ" అనీ పిలుస్తుండేవారు.



రూథర్‌ఫర్డ్ హేస్ ఓహియోనందలి డెలవేర్‌లోపుట్టాడు. కాని, అతని తలిదండ్రులు న్యూ ఇంగ్లాండు వారు; గూడుబండిలో వాళ్ళు ఓహియోకు వలసవచ్చారు. ప్యూరిటన్ క్రైస్తవ సంప్రదాయానికి చెందిన అతని తల్లి అతనిని నియమంగా నిబ్బరంగా



పెంచింది. అతనికి భాతృభక్తి గల ఒక సోదరివుంది; ఆమె, అతని మేనమామ కలిసి ముందు ఓహియోనందలి కెన్యన్ కాలేజీకి, పిమ్మట హార్వర్డు లా స్కూలుకు అతన్ని పంపించి చదివించారు.

హేస్ న్యాయవాదవృత్తి వదలి యూనియన్ సైన్యంలో చేరాడు. చాలా యుద్ధాలలో పాల్గొన్నాడు; గాయపడ్డాడు; యుద్ధాంతానికి బ్రిగేడియర్ జనరల్ పదవిలో వున్నాడు. యుద్ధానంతరం రెండుపర్యాయములు కాంగ్రెస్ సభ్యుడుగా ఎన్నికైనాడు; మూడుపర్యాయములు ఓహియోగవర్నరుగా పనిచేశాడు.

రూధర్ ఫర్డు హేస్, అతని కుటుంబం వాషింగ్టన్‌కు వచ్చిన తర్వాతకూడ తమ నిరాడంబర, నియమ జీవితవిధానాన్నే కొనసాగించారు. అధ్యక్షదంపతు లిరువురు గాఢ దైవభక్తిపరులు. వైట్‌హౌస్‌లో ప్రతిదినం ఉదయం ప్రార్థనలు జరుగు

తుండేవి సాయంత్రవేళల ఆ కుటుంబం స్నేహితులతో కలిసి చదువుతూ, సంగీతం వింటూ ఆనందంగా కాలం గడిపేవారు.

ప్రభుత్వవ్యవహారాలను సంస్కరించటానికి ప్రెసిడెంట్ హేస్ కృషి చేశాడు. పదవిని దుర్వినియోగం చేశారని తాను ఎంచిన వ్యక్తులను ఉద్యోగాలనుండి ఊడబీకాడు. ఏ పార్టీకి చెందినవారయినాసరే సమర్థులైనవారికి ఉద్యోగాలిచ్చాడు. తన రాజకీయమిత్రులు ఇందు కభ్యంతరం తెలిపినప్పుడు "ఎవరు తన దేశానికి ఎక్కువ సేవచేస్తారో వారు తమపార్టీకి ఎక్కువ సేవ చేసినవా రవుతారు" అని బదులు చెప్పాడు.

అతడు తీసికొన్న ప్రథమచర్యలలో దక్షిణరాష్ట్రాల ప్రధాన నగరాలనుండి ఫెడరల్ సైన్యాలను పిలిపించటం ఒకటి. యుద్ధం ముగిసింది లగాయతు ఈ సైన్యా లక్కడే వున్నాయి. దక్షిణరాష్ట్రాల పునర్నిర్మాణానికి ప్రభుత్వం తలపెట్టిన పథకా లన్నీ విఫలమయ్యాయి కనుక ఇప్పుడు ప్రభుత్వం జోక్యం లేకుండా దక్షిణప్రాంతం తన సమస్యలను తానే పరిష్కరించు కోవటానికి ఈ చర్యవల్ల అవకాశం ఏర్పడింది.

నాలుగేండ్లు తీరినపిమ్మట దయాశాలి రూథర్‌ఫర్డు వైట్ హౌస్‌ను విడిచి వెళ్ళునప్పుడు, అతడక్కడ ప్రవేశించినప్పటి కంటే ఘనంగా భావించబడినాడు "హేస్ అవ్వ" అని వేళా కోళము చేయబడిన ఆ వ్యక్తివల్ల దేశమంతట పరిస్థితులభివృద్ధి చెందినవి సామాన్యపౌరుడుగా, ఓహియోనందలి స్వగృహంలో వుండి, ఎక్కువ పాఠశాలల స్థాపనకు, ఖైదీల జీవన పరిస్థితు లభివృద్ధికి కృషి చేస్తూ జీవితశేషం గడిపాడు; అంతేకాక, తన సైనికమిత్రుల అభివృద్ధికి చాలా తోడ్పడ్డాడు. ★

# జేమ్సు గార్ ఫీల్డ్

## ఆరు నెలల అధ్యక్షుడు

నవంబరు 19, 1831 — సెప్టెంబరు 19, 1881

రిపబ్లికన్ — ఇరువదియవ అధ్యక్షుడు 1881

రూథర్ ఫర్డు హెయిస్ తర్వాత అభ్యర్థిని నిర్ణయించుటకై సమావేశమైన రిపబ్లికన్ మహాసభలలో, తాను అధ్యక్ష పదవికి అభ్యర్థిగా నియమించబడినట్లు విని జేమ్సుగార్ ఫీల్డు నిజంగా ఆశ్చర్యపడ్డాడు. దయార్ద్ర హృదయుడైన ఆ ఓహియో సెనేటర్ అధ్యక్షుని ఎన్నికకు నిలుస్తానని కలలో కూడా అనుకోలేదు. అతడు మహాసభా మందిరాన్ని విడిచి వెళ్ళేటప్పుడు సంతోషం పట్టలేకపోయాడు. జేమ్సుగార్ ఫీల్డు ఎన్నికైనాడు.

ఓహియోయందలి ఆరంజిలో గార్ ఫీల్డు పుట్టాడు; దారు కుటీరంలో పుట్టిన అధ్యక్షులలో ఆయన కడపటివాడు. అతని పసితనంలో తండ్రి అడవిలో లేచిన మంటల నార్పుతూ ప్రాణాలు కోల్పోయాడు. గార్ ఫీల్డు దంపతులకు నలుగురు పిల్లలున్నారు. ఈ పిల్లల తోడ్పాటుతో ధైర్యశాలియైన ఆ పురోగామి తల్లి కమతం పనిపాటలు నెరవేరుస్తుండేది. జిమ్, అతని అన్న పొలాలలోనూ, చుట్టుపట్ల కమతాలలోనూ పని చేస్తుండేవారు.



పదహారవయేట జిమ్‌గార్‌ఫీల్డు కాలువ పడవమీద పనికి కుదిరాడు. ఇరుకు కాలువమీద మెల్లగా జరిగే పడవలను లాగుతున్న కంచరగాడిదలను తోలుతూవుండేవాడు. కాని అతనికి పుస్తకాలమీద ప్రేమవుంది; చదువుకోవాలనే అపేక్షవుంది. ఎలాగో పాఠశాలలో, కళాశాలలో చేరి చదువుకొన్నాడు.

యుద్ధకాలంలో జనరల్ గార్‌ఫీల్డు సైనికోద్యోగానికి రాజీనామా పెట్టి కాంగ్రెస్ సభ్యుడైనాడు; పదహారేండ్ల పోటీపదవిలో వున్నాడు. సెనెటర్‌గా ఎన్నికైనాడు కాని, సెనేట్‌లో కూర్చొనక ముందే తలవనితలంపుగా అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

సచ్ఛీలుడు, ఆర్ద్రహృదయుడైన ప్రెసిడెంట్ గార్‌ఫీల్డును వెంటనే ప్రభుత్వోద్యోగాలకు దేవుల్లాడే మనుషులు చుట్టుముట్టారు. ప్రమాణ స్వీకరణానంతరం నాలుగు నెలలు నిండకముందే, అధ్యక్షుడు వాషింగ్‌టన్ రైల్వేస్టేషనులో నిలబడి వుండగా, ప్రభుత్వోద్యోగముకోరి, ఆశాభంగము పొందినవాని చేత ఆయన కాల్చబడ్డాడు. తర్వాత రెండు నెలలకు కొంచెం పైగామాత్రం ఆయన జీవించాడు. ★

# చెస్టర్ ఆర్థర్

## అధ్యక్షుడైన ఉపాధ్యక్షుడు

ఆక్టోబరు 5, 1830 నవంబరు 18, 1886

రిపబ్లికన్ ఇరవై ఒకటవ అధ్యక్షుడు 1881 - 1885

ప్రెసిడెంటు గార్ ఫీల్డు మరణానంతరం కొన్ని గంటల తర్వాత ఉపాధ్యక్షుడు చెస్టర్ ఆర్థర్ న్యూయార్కు నగర మందలి స్వగృహంలో అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించాడు. చెస్టర్ ఆర్థర్ అధ్యక్షుడైన కాలంలో దేశం చాలా అల్లకల్లోలంగావుంది. ఒక రాజకీయపు టొడంబడిక ద్వారా అతడు ఉపాధ్యక్షుడైనాడని చాలామంది అను కొంటూ వుండటంచేత, చక్కని దుస్తులుధరించే ఈ పొడ వాటి, అందగాడైన రాజకీయవేత్త ప్రభుత్వోద్యోగాలు కానుకలుగా ఇచ్చివేస్తాడని ప్రజలు భావించారు.

ప్రెసిడెంట్ గార్ఫీల్డు మరణశయ్యపైవున్న మాసాలలో,- అధ్యక్షపదవి తన భుజాలపై పడినయెడల ఏవిధానం అనుసరించాలో యోచించటానికి ఈ ఉపాధ్యక్షునకు సమయం లభించింది. చెస్టర్ ఆర్థర్‌లో మార్పువచ్చింది. అతని పూర్వ చరిత్ర సూచించినదానికంటే ఎంతో గొప్ప అధ్యక్షుడుగా ధృవ పరచుకొన్నాడు. ప్రభుత్వ వ్యవహారాలను న్యాయంతో, నేర్పుతో, నిర్వహించాడు.

వెర్మాంట్ నందలి ఫేర్ ఫీల్డులో అతిసామాన్యమైన ఒక పొదరింట చెస్టర్ ఆర్థర్ జన్మించాడు. అతని తండ్రి బాప్టిస్టు క్రైస్తవమతాచార్యుడు; ధర్మమునందు చలించని విశ్వాసం కలవాడు. ఈ పల్లెటూరి పిల్లవాడు ఒక చిన్న కాలేజీలో పట్టభద్రుడై న్యూయార్కునందలి ఒక న్యాయశాస్త్రకార్యాలయంలో చేరాడు. తన పనిలో విజయం సాధించాడు; సజ్జనత్వముమీద, వున్నతపదవులమీద మమకారం అలవరచుకొన్నాడు.

రాష్ట్రాల అంతర్యుద్ధకాలంలో న్యూయార్కు సైనికుల సరఫరా అధికారిగా అతడు కార్టర్ మాస్టర్ జనరల్‌గా పనిచేశాడు. యుద్ధానంతరం న్యూయార్కు రేవు కలెక్టరుగా నియమించబడ్డాడు; ఈ పదవి వల్ల అతని కెంతో పలుకుబడి, బలం చేకూరింది. కొన్ని సంస్కరణ నిబంధనలను నిర్లక్ష్యంచేసి



నందువల్ల ప్రెసిడెంట్ హేయిస్ అధ్యక్షకాలంలో ఆ పదవి నుండి ఆయన తొలగించబడ్డాడు. ధర్మబద్ధమైన ఆయన పరిపాలనా సామర్థ్యం చూచి దేశం అచ్చెరువుపడింది. జేమ్సు గార్ఫీల్డు పదవీకాలం నీతిగా పూర్తి చేశాడు. స్వతహాగా అధ్యక్షుడు కావటానికి ఆయన అర్హతకలవాడని చాలామంది భావించినారు కాని అతడు అభ్యర్థిగా నిలబడలేదు. తర్వాత అతడు న్యూయార్కులో తన న్యాయవాదవృత్తికి మరలాడు. రెండేండ్ల తర్వాత చనిపోయాడు.

★

# గ్రోవర్ క్లీవ్ లాండ్

## చీపురుగుర్తుగల అధ్యక్షుడు

మార్చి 18, 1837 — జూన్ 24, 1908

డెమోక్రాట్ — ఇరవై రెండవ అధ్యక్షుడు 1885 - 1889

ఛెస్టర్ ఆర్థర్ తర్వాత డెమోక్రాటిక్ పార్టీవాడైన శక్తిమంతుడు గ్రోవర్ క్లీవ్‌లాండ్ అధ్యక్షుడైనాడు. తల్లి ఇచ్చిన పాతబైబిలు మీద చేయివుంచి, యునైటెడ్ స్టేట్సు ఇరవై రెండవ అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించాడు. ఇరవై నాలుగేండ్లలో మొదటిసారిగా డెమోక్రాటిక్ అధ్యక్షుడు వైట్‌హౌస్‌లో నివాస మేర్పరచుకొన్నాడు. క్లీవ్‌లాండ్ హుందామనిషి; ఆలోచనాపరుడు. మీసాలతో, పొడవుగా, లావుగావుంటాడు. ప్రభుత్వ వ్యవహారాల నిర్వహణలో ఉన్నత ప్రమాణాలను అవలంబించినవాడుగా అతడు పేరుపొందాడు.

అతని ఎన్నికలగుర్తు చీపురుకట్ట. జిల్లా షరీఫుగా తన మొదటి రాజకీయపదవిలో అవినీతి, దుబారాలను తుడిచివేశాడు. బఫెలో మేయరుగా, అవినీతి నెదుర్కొని, విరోధం తెచ్చుకోవటానికి వెనుదీయలేదు. న్యూయార్కు రాష్ట్రగవర్నరుగా, రాజకీయ కశ్మలాన్ని తుడిచివేయటంలో ధైర్యంతో, ఓపికతో వ్యవహరించాడు. కొన్నిసంవత్సరాలకాలంలో జిల్లాషరీఫుపదవి నుండి అధ్యక్షపదవికి వచ్చాడు.

గ్రోవర్ క్లీవ్‌లాండ్ క్రైస్తవమతాచార్యుని కుమారుడు న్యూజర్సీలోని కాల్డ్వెల్‌లో పుట్టాడు. తాను పెరిగిన సోదరి ఇంట్లో మంచిచెడ్డల వివేచన నేర్చుకొన్నాడు. ఐదుగురు తోబుట్టువులలో అతడొకడు. స్నేహశీలం, సత్స్వభావం కలవాడు; వయసుకు మించిన ఆలోచనలు చేసేవాడు. ఆటలంటే అతనికి ప్రీతి; సోదరులతో కలిసి, వేటాడేవాడు; చేపలుపట్టూ వుండేవాడు.

తండ్రి మరణానంతరం అనుకొన్నప్రకారం కాలేజీకి వెళ్ళలేకపోయాడు; ఒక దుకాణంలో గుమాస్తాగాచేరి, అంధులఆశ్రమంలో చదువు చెప్తూ, పినతండ్రికి లేఖలు చూచిపెట్టూంటేవాడు. బఫెలోలోని ఒక లా (న్యాయశాస్త్ర) కార్యాలయంలో పనిచేస్తూ చదువుకొనటానికి అతని కవకాశం దొరికింది. యువకుడైన గ్రోవర్ క్లీవ్‌లాండ్ కష్టించి పని చేసి పెద్ద న్యాయవాది, రాజకీయవేత్త ఐనాడు.



తా నంతకుముందు అధిష్ఠించిన రాజకీయపదవులను నిర్వహించిన తీరునుబట్టి గ్రోవర్‌క్లీవ్‌లాండ్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. ఆయన గట్టిపట్టుదల కలవాడు; సమర్థుడు కూడ. "ప్రజాధికారమంటే ప్రజాధర్మకర్తృత్వం" అనే విశ్వా



సంతో దేశంలో ఆయన నీతివంతమైన పరిపాలనను నెల కొల్పాడు.

ఆయన పట్టినపట్టు విడువని అధ్యక్షుడు. తనకు పూర్వం ఏ అధ్యక్షుడుకూడ నిషేధించనన్ని చిత్తుచట్టాలను నిషేధించి కొందరి కప్రీతిపాత్రుడైనాడు. లెక్కలేకుండా వెండినాణెములను

చలామణిలో పెట్టడాన్ని వ్యతిరేకించి, బంగారం ప్రమా ణాన్ని నిలపటానికి గట్టి పట్టుపట్టాడు. ఆయన అధ్యక్షుడుగా వున్నప్పుడు పశ్చిమాన విశాలభూభాగాలు నివాసాల కనుమతించ బడినవి.

గ్రోవర్ క్లీవ్‌లాండ్ అధ్యక్షుడైనప్పుడు అవివాహితుడు. అధ్యక్షుడైన రెంటవ ఏట, బఫెలోలోని తన న్యాయవాద భాగ స్వామి కూతురును పెండ్లాడాడు. ఇది వైట్‌హౌస్‌లో మొట్ట మొదట జరిగిన అధ్యక్షుని వివాహం.

ఆయన పరిపాలనా కాలంలో బొక్కసంలో అదనపు డబ్బు చాలా చేరనారంభించింది. హెచ్చుపన్నులవల్ల కొద్దిమంది సంపద పెరిగి, ఎక్కువమంది జీవనవ్యయం పెరుగుతుందని భావించి, ఆయన పన్నులను తగ్గించాలని విశ్వసించాడు. పదవీ కాలానంతరం తిరిగి ఎన్నికలో క్లీవ్‌లాండ్ ఓడిపోయినాడు. గ్రోవర్ క్లీవ్‌లాండ్ అతి స్వతంత్రుడనీ, ఒకరిమాట లెక్క చేసేవాడుకాడనీ చాలామంది రాజకీయవేత్తలు అర్థంచేసు కొన్నారు.

క్లీవ్‌లాండ్ తిరిగి న్యాయవాదవృత్తికి మరలాడు. కాని నాలుగేండ్లతర్వాత తిరిగి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. అతడు సంయుక్తరాష్ట్రాలకు ఇరవైరెండవ అధ్యక్షుడేకాక ఇరవై నాలుగవ అధ్యక్షుడు కూడ. ★

# బెంజమిన్ హారిసన్

## బిలియన్ డాలర్ కాంగ్రెస్ యుగంతుడు

అగస్టు 20, 1833 — మార్చి 13, 1901

రిపబ్లికన్ — ఇరవై మూడవ అధ్యక్షుడు 1889 - 1893

గ్రోవర్ క్లీవ్ లాండ్ ప్రథమ ద్వితీయ పదవీ కాలంమధ్య అధ్యక్షుడైన బెంజమిన్ హారిసన్ దేశాని కెంతో సేవచేసిన కుటుంబం నుంచి వచ్చాడు. అతనితండ్రి కాంగ్రెస్ సభ్యుడుగా వున్నాడు. ఇండియనులతో పోరాడిన అతని తాత విలియం హెన్రీహారిసన్ యునైటెడ్ స్టేట్సు తొమ్మిదవ అధ్యక్షుడుగా వున్నాడు. స్వతంత్ర ప్రకటనపై సంతకం చేసిన దేశభక్తులలో అతని ముత్తాతకూడా ఒకడు. బెంజమిన్ హారిసన్ స్వయంగా సెనెటర్ గా వున్నాడు; రాష్ట్రాల అంతర్యుద్ధంలో జనరల్ గా పనిచేశాడు.

అతడు గొప్పవక్త; అమెరికా అధ్యక్షులలో శ్రేష్ఠులలో ఒకడు. కాని, మనుషులు దగ్గరకువచ్చినప్పుడు దూరంగా మౌనంగా వుంటాడు. అతడు పార్టీనడపినట్లునడిచే పార్టీ మనిషి; అతని పరిపాలనాకాలంలో ప్రభుత్వ వ్యవహారాలను కాంగ్రెస్ తన చేతికి తీసుకొన్నది. ప్రెసిడెంట్ హారిసన్ పొట్టిగా, బొద్దుగా వుంటాడు. అతని ప్రత్యర్థులు, తాత హాట్ పెట్టుకొని, పెద్ద కుర్చీలో కూర్చున్న మరుగుజ్జులాగా అతని బొమ్మలు గీస్తుండేవారు.

ఓహియో నందలి నార్త్ బెండ్ బెంజమిన్ ఫ్రాంక్లిన్ జన్మస్థానము. తన తండ్రి పొలంలో పనిచేశాడు; కర్రలతో కట్టిన పాఠశాలకు వెళ్ళి చదువుకొన్నాడు.

ఓహియోలోని చిన్న కాలేజీలో పట్టభద్రుడైనాడు. ఇండియానా యందలి ఇండియాన పోలీస్‌లో న్యాయవాదవృత్తి సాగించాడు.

యూనియన్ సేనలో చేరినందువల్ల న్యాయవాదవృత్తికి భంగం కలిగింది. తన స్వంత సైనికదళాన్ని ఏర్పరచుకొన్నాడు. యుద్ధాంతానికి సైనికుడుగా, గొప్ప ప్రతిష్ఠ సంపాదించాడు; బ్రిగేడియర్ జనరల్ పదవి లభ్యమైంది.



బెంజమిన్ ఫ్రాంక్లిన్ అధ్యక్షుడైనప్పుడు బొక్క సంలో చాలా అదనపుడబ్బు వుండటం చూచాడు; కాని, అతని కాంగ్రెసు 'విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టే బిలియన్ డాలర్ కాంగ్రెస్' అని పేరు తెచ్చుకొన్నది. వెండి కొనుగోలుచట్టం ఆమోదించబడింది. ఈ చట్టం ప్రకా

రము, ప్రతి యేట ప్రభుత్వం నోట్లిచ్చి, పెద్దమొత్తం వెండి కొన్నది. ఈ నోట్లకు బదులు బంగారం ఇవ్వాలి. ఇందువల్ల బొక్కసంలో చాలా బంగారం తరిగిపోయింది.

వ్యాపారం బాగా అభివృద్ధిచెందిందికాని ధరలు పెరిగినవి. ఈ పరిపాలనయెడల చాలామందికి అసంతృప్తి కలిగింది. రెండవసారి ఎన్నికలో బెంజమిన్ హారిసన్ ఓడిపోయాడు; డెమోక్రాటులు ఇలా పాడుతుండగా గ్రోవర్ క్లీవ్‌లాండ్ మరల వైట్‌హౌస్‌కు ఆహ్వానించబడ్డాడు. ✱

# గ్రోవర్ క్లీవ్ లాండ్

## ద్వితీయ పదవీకాలం

మార్చి 18, 1837 జూన్ 24, 1908

డెమోక్రాట్ ఇరవై నాలుగవ అధ్యక్షుడు 1893 - 1897

గ్రోవర్ క్లీవ్ లాండ్ ద్వితీయపదవీకాలలో ప్రథమ పదవీ కాలంలో వున్నంత సుఖంగా లేడు. తన అధ్యక్షవిధులను వెనుకటి తీరుగానే పట్టుదలతో నిర్వహించాడుగాని, ఒక తీవ్రసమస్య తర్వాత ఒక తీవ్రసమస్య అతన్ని ఎదుర్కొన్నవి. సమ్మెలు, కార్మిక వివాదాలు, జరుగుతున్న కాలమది. అతడు పదవీస్వీకారం చేసిన వెంటనే దేశాన్ని ఆర్థికమాంద్యం అలముకొన్నది. ప్రభుత్వపుబంగారు సరఫరా తగ్గిపోయింది. ఎక్కువధనం చెలామణిలో పెట్టడానికి నిరవధికంగా వెండినాణెములు కావలెనని అందరూ కోరారు. ఐనప్పటికీ, బంగారంప్రమాణాన్నే క్లీవ్ లాండ్ సమర్థించాడు.

క్యూబాద్వీపంలో ప్రజలు స్పెయినునుండి స్వతంత్రం కొరకు పోరాడుతున్నారు. క్యూబాలోయునైటెడ్ స్టేట్సు జోక్యం కలిగించుకోవటం క్లీవ్ లాండ్ కు ఇష్టంలేదు. హవాయ్ద్వీపాలలో అమెరికను వలసప్రజలు స్థానికరాణిపై తిరుగుబాటు చేశారు. రిపబ్లికను నెలకొల్పి యునైటెడ్ స్టేట్సులో చేరాలని కోరుతున్నారు. హవాయ్ని కలుపుకోవటం ప్రెసిడెంట్ క్లీవ్ లాండ్ కు సమ్మతం కాలేదు,

ప్రెసిడెంట్ క్లీవ్‌లాండ్ తన స్వంతబాధలు ప్రజలకు తెలియనీయలేదు. ఈస్టిరివర్‌లో ఒక విహారనౌకపై వుండగా పెద్ద శస్త్రచికిత్స పొందాడనీ, ఆ శస్త్రచికిత్సవలననే ఆతడు బ్రతికాడనీ తర్వాత కొన్ని సంవత్సరాలకుగానీ ఎవరికీ తెలియలేదు.

రెండవ పదవీకాలాంతానికి ప్రెసిడెంట్ క్లీవ్‌లాండ్ విధానా లనేకం ప్రజల కప్రియమైనవి. తన సొంతపార్టీయే అతనిని వ్యతిరేకించింది. యునైటెడ్‌స్టేట్సు తన విధానాన్ని మార్చుకొని ప్రపంచవ్యవహారాలలో బృహత్పాత్రవహించాలనే భావం దేశం నలుమూలలు వ్యాపించింది. క్లీవ్‌లాండ్ ప్రిన్స్‌టన్‌కు విశ్రాంతికి వెళ్ళాడు. అక్కడ విశ్వవిద్యాలయానికి ధర్మకర్తయైనాడు.

"మంచిచేయటానికి చాలా గట్టిగా ప్రయత్నించాను" అమెరికను అధ్యక్షులలో మహాశక్తివంతులలో ఒకరైన గ్రోవర్ క్లీవ్‌లాండ్ పలికిన చివరిమాటలివి.

★

# విలియం మెకిన్లీ

## మేలురోజులు, నిండు భోజనము

జనవరి29, 1843 — సెప్టెంబరు 14, 1901

రిపబ్లికన్ — ఇరవైయైదవఅధ్యక్షుడు 1897 - 1901

క్లీవ్‌లాండ్ వైట్‌హౌస్ విడిచి వెళ్ళేసమయానికి ఆర్థిక మాంద్యం తీరింది. ఆయన తర్వాత వచ్చిన అధ్యక్షుడు దేశానికి మేలురోజులు, ప్రజలకు నిండుభోజనం వాగ్దానం చేశాడు. తన ఎన్నికల ప్రచార సమయంలో విలియం మెకిన్లీ ఓహియోయందలి కాంటన్‌లోని తన ఇంటిలోనే వున్నాడు. రైలుమీద వచ్చే ఓటర్ల ప్రతినిధులకు ఇంటి ముందు వసారాలోవుండి ప్రతిదినం వుపన్యసించేవాడు. ఈ ఉపన్యాసాలను వార్తాపత్రికలు దేశంనలుమూలలకు తీసుకుపోతుండేవి. మెకిన్లీ ఎన్నికకు క్లీవ్‌లాండ్, కోటీశ్వరుడైన మార్క్‌హన్నా కృషి ప్రధాన కారణం; ఈయనకు రాజకీయంగా చాలా పలుకుబడి వుంది.

ప్రెసిడెంట్ మెకిన్లీ నిదానంగా, హుందాగా, అందరితో స్నేహంగా వుండేవాడు; ఎవ్వరితోనూ అనవసర తగాదాపడలేదు. అతని వ్యక్తిత్వం ప్రజలను - అతని విధానాలను అంగీకరించని వారినికూడా ఆకర్షించేది. ఆయన భార్య దీర్ఘరోగి; ఆమెమీద ఆయనకెంతో ప్రేమ. వైట్‌హౌస్‌లో వారిజీవితం ఎంతో సుఖంగా గడిచింది; కాని అకస్మాత్తుగా అది విషాదాంతంగా ముగిసింది.



విలియం మెకిన్లీ ఇనుపకర్మాగారంలో పనిచేసే ఒక కార్మికుని కుమారుడు; ఓహియోనందలి నైల్స్ అనే చిన్న పట్టణంలో ఆయన పుట్టాడు; ఏడుగురు సంతానంలో ఆయన ఒకడు. పద్దెనిమిదవయేట బడిపంతులుగా వుంటూ పోస్టాఫీసులో కూడా పనిచేస్తూ వుండేవాడు. రాష్ట్రాల అంతర్యుద్ధ కాలంలో సైనికుడుగా చేరి ఇరవై రెండోఏట వచ్చేటప్పటికి మేజరుపదవి పొందాడు. యుద్ధంనుండి తిరిగి వచ్చిన తర్వాత ఓహియోలోని కాంటన్‌లో గొప్ప న్యాయవాదిగా పేరుపొందాడు.

అధ్యక్షుడుకాకముందు మెకిన్లీ కాంగ్రెస్ సభ్యుడుగానూ, తన రాష్ట్రపు గవర్నరుగాకూడా వున్నాడు. ఆయన వాణిజ్యాభిమాని; అమెరికా వ్యాపారాన్ని రక్షించడానికి దిగుమతి సుంకాలు హెచ్చుచెయ్యాలని ఆయన నమ్మిక.

ఆయన పరిపాలనాకాలంలో బంగారపు ప్రమాణసమస్య దాని అంతట అదే పరిష్కారమైంది. అలాస్కాలో బంగారు గనులు కనుగొనబడ్డాయి. బంగారపురాళ్ళనుండి బంగారాన్ని తీయటానికి పూర్వంకంటే మేలైన పద్ధతికూడా కనిపెట్టబడింది. కాంగ్రెస్ బంగారాన్ని అదనంగా చాలా నిల్వచేసింది. బంగారం ప్రమాణం ఆమోదించబడింది. నోట్లు రూపంగాగానీ, ఇతర రూపంగాగానీ ప్రభుత్వం చెలామణిలో పెట్టిన డబ్బుకు బదులుగా బంగారం ఇవ్వగల అవకాశం ఏర్పడింది.

మెకిన్లీ క్రింద దేశం తన వైదేశిక విధానాన్ని పూర్తిగా మార్చుకొన్నది. క్యూబా దేశస్థుల స్వతంత్ర సముపార్జనకు తోడ్పడటానికీ, అక్కడ తన స్వంత ప్రయోజనాలను రక్షించుకోవటానికీ యునైటెడ్ స్టేట్సు క్యూబా వ్యవహారాలలో జోక్యంచేసుకొన్నది. ఇది స్పానిష్ - అమెరికను యుద్ధానికి దారితీసింది. ఈ యుద్ధ పర్యవసానంగా క్యూబా అమెరికా పరిరక్షణ



క్రిందకు వచ్చింది. అంతేకాక పోర్టోరికో, గొవాం, ఫిలిప్పీయను దీవులుకూడ స్పెయిను అమెరికాకు దత్తం చేసింది.

హవాయ్ ద్వీపాలుకూడా అమెరికా రక్షణక్రింద లేనట్లయితే జపాను వాటిని ఆక్రమించుకుంటుందని భయపడి, అదేకాలంలో ఆ దీవులను అమెరికా స్వాధీనం చేసుకొన్నది.

ఇప్పుడు, తన సరిహద్దువెలుపల దేశాలుకూడ ఆధీనంలో వుండటంచేత, అమెరికా, అంతర్జాతీయ బాధ్యతలుగల ప్రపంచ రాజ్యములలో ఒకటి అయినది. ఆనాటి ఒక వ్యంగ్యచిత్రంలో "అమెరికా మాను" అతి లావయిపోయినట్లు, అతనికి క్రొత్త వుడుపులు కావలసి వచ్చినట్లు, అధ్యక్షుడు మెకిన్లీ టేపు చేత పట్టుకొని నిలబడినట్లు చిత్రించబడింది.

దేశంలో సౌభాగ్యం పెరిగింది; ప్రజాభిమానం చూరగొన్న అధ్యక్షుడు మెకిన్లీ తిరిగి రెండవపర్యాయము ఎన్నికయ్యైనాడు. ఆరునెలలతర్వాత ఆయన బఫెలోలో అఖిల అమెరికా ప్రదర్శనము సందర్శిస్తూ వుండగా, ఒక అరాజకవాది, పిస్తోలు చేతిలో దాచుకొని అధ్యక్షుని అభినందించటానికి వేచివున్న గుంపులో కలిసివున్నాడు; రెండుసార్లు గుండ్లు ప్రేలినవి. అధ్యక్షుడు మెకిన్లీ తీవ్రగాయాలతో వెనుకకు ప్రాలిపోయాడు. తర్వాత ఎనిమిదిరోజుల కాయన చనిపోయాడు. హత్యగావించబడిన యునైటెడ్‌స్టేట్సు అధ్యక్షులలో ఆయన మూడవవాడు.



# థియోడోర్ రూజ్‌వెల్టు

## కరకు రౌతు

అక్టోబరు 27, 1867 జనవరి 6, 1919

రిపబ్లికన్ ఇరవై ఆరవ అధ్యక్షుడు 1901 - 1909

ఉపాధ్యక్షుడు థియోడోర్ రూజ్‌వెల్టు అడిరోండాక్ పర్వతప్రాంతపు అడవులమధ్య మకాముచేసి వుండగా, ఒకదూత, అధ్యక్షుడు మెకిన్లీ మరణశయ్యమీాదవున్న వార్త తెచ్చాడు. ఆ వుపాధ్యక్షుడు బఫెలోకు హుటాహుటి బయలుదేరాడు; మెకిన్లీ మరణించిన కొన్నిగంటలతర్వాత అతడు ఇరవై ఆరవ అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించాడు. స్వతంత్రభావాలుగల ఈ పసులకాపరి అధ్యక్షుడు ఏమి చేయనున్నాడో తెలియక రాజకీయవేత్తలు, వాల్ స్ట్రీట్ బాంకర్లు ఆందోళన పడ్డారు.

థియోడోర్ రూజ్వెల్టుకు అప్పుడు నలభైమూడేండ్లు. యునైటెడ్ స్టేట్సు అధ్యక్షులందరిలో చిన్నవాడు. ఆయన విసుగు విరామం లేకుండా పనిచేస్తాడు; తీవ్రస్వభావము; ఎప్పు దేది తోస్తే అది చేస్తాడు. ప్రతి విషయంలోనూ, తనచుట్టు వున్న ప్రతిమనిషినిగురించి ఆయనకు ఆసక్తి మెండు. ఒకసారి పేరు వింటే ఇక మరచిపోడు. ఎక్కడైతే టెడ్డీ రూజ్వెల్టు ఉంటాడో అక్కడ ఉద్రేకం తప్పకుండా వున్నదన్నమాటే. ఆరంభం నుండి, ప్రజలకు, శక్తిసంపన్నుడైన తమ ఈ అధ్యక్షుడంటే

ఇష్టం. అతని నిష్కాపట్యం, నిజాయితీ, అతని మహామంద హాసం వారికి ఇష్టం.

థియోడోర్ రూజ్వెల్టు న్యూయార్కునందలి ప్రాచీన మైన ఒక సంపన్నకుటుంబంలో పుట్టాడు. అతని డచ్చిపూర్వీ కులలో ఒకరు న్యూయార్కులో స్థిరపడ్డారు; అప్పుడు న్యూయార్కు న్యూఆమ్స్టర్డంం అనే చిన్న రేవుపట్టణంగావుండేది.

పదమూడవయేట 'టెడ్డీ' బలహీనంగా బక్కగా వుండేవాడు. దగ్గరచూపు ఆనదు. అందుచేత లావాటి కళ్ళ అద్దాలు పెట్టుకొనే వాడు. ఈ బక్కపిల్లవాడు తక్కిన అందరు బాలకుల వలె వుండాలని దృఢనిశ్చయం చేసుకొన్నాడు. బాక్సింగ్ నేర్చుకొన్నాడు. గుర్రపు స్వారి, తుపాకి కాల్పు నేర్చుకొన్నాడు. తీక్ష్ణమైన ఆటగాడైనాడు. హార్వర్డు కాలేజీలో పట్టభద్రుడై అటుపిమ్మట కొలంబియా విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదివాడు.





పడమట అతని కొక పశులకొష్ఠంవుంది. కొంతకాలం అక్కడ పశులకాపరిగా వున్నాడు, గుర్రం ఎక్కి పశువులను మళ్ళవేస్తూ ఆరుబయట నివసిస్తూ గడిపాడు. బయళ్ళలో అడవి దున్నలను కాల్చాడు; కొండసింగాలను వేటాడాడు. చరిత్రను గురించి, బయట జీవితాన్నిగురించి పుస్తకాలు వ్రాశాడు.

థియోడోర్ రూజ్వెల్టుకు రాజకీయా లంటే ఇష్టం. చక్కని పోట్లాట అంటే అతనికి ప్రీతి. న్యూయార్కు పోలీసు

బలగానికి నాయకుడుగా ప్రథమంగా తనకు లభించిన రాజకీయ ఉద్యోగం మొదలు చేసుకొని నేరాలతో, లంచగొండితనంతో పోరాటం సాగించాడు. నౌకాదళానికి సహాయకార్యదర్శిగావుండి దేశ నౌకాబలాన్ని వృద్ధిచేశాడు.

సాహసకృత్యాలను, ఉద్రేకభావాలను ప్రేమించే టెడ్డీ రూజ్వెల్టు స్పానిష్ అమెరికను యుద్ధకాలంలో 'కరకురౌతు'ల దళాన్ని ఒకదానిని నిర్మాణంచేసి క్యూబాకు సముద్రంమీద వెళ్ళాడు. ఈ కరకురౌతులు ప్రశంసా పాత్రంగా పోరాడారు. కలోనెల్ రూజ్వెల్టు యుద్ధవీరుడై ఇల్లుచేరాడు. న్యూయార్కు-రాష్ట్రానికి ఆయన గవర్నరైనాడు. ఆరునెలలు ఉపాధ్యక్షుడుగా వున్నాడు. ఆ తర్వాత తలవని తలంపుగా అధ్యక్షుడైనాడు.

అతడు అలసట యెరుగని అధ్యక్షుడు. అభివృద్ధి పథకాలు, అభ్యుదయభావాలు నిండినవాడు. దేశంలోని అడవుల సంరక్షణకు, బంజరుభూములను సాగుకిందికి తీసుకురావటానికి కృషిచేశాడు. రష్యా-జపాను మధ్య జరిగిన యుద్ధంలో సంధి చేయుటకు తోడ్పడ్డాడు.

కార్మికులకు, పెట్టుబడిదారులకు కూడా న్యాయం జరగాలని కోరుతూ, వాణిజ్యసంఘములతోనూ, పెద్దపెద్ద వర్తకులతోనూ పోరాటం సల్పాడు. తన పలుకుబడి దెబ్బతింటున్నా లక్ష్యం చెయ్యక ప్రభుత్వశాఖలలోని అవినీతిని బట్టబయలు చేశాడు. అతన్ని దండధరుడైన అధ్యక్షుడు అని వర్ణించేవారు.



ఉక్కుతో నిర్మించిన తెల్లరంగువేసిన పదహారుయుద్ధ నౌకలతోకూడిన 'వైట్ ఫ్లీట్' ను అమెరికా నౌకాశక్తిని లోకానికి తెలియపరచటంకోసం అతడు ప్రపంచం చుట్టు యాత్ర చేయించాడు.

పెనామా భూ సంధిమీదుగా కాలువ త్రవ్వటానికి ప్రెసిడెంట్ రూజ్వెల్టు పరిపాలన కాలములో యునైటెడ్ స్టేట్స్ పూనుకొన్నది. అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రాలను కలిపే ఈ జలమార్గం యునైటెడ్ స్టేట్సు రక్షణకు అతిముఖ్యమైనది. ప్రపంచంలోని గొప్ప ఇంజనీరింగు అద్భుతాలలో ఒకటైన ఈ కాలువ నిర్మాణాన్ని పరిశీలించడంకోసం థియోడోర్ రూజ్వెల్టు పనామాకు వెళ్ళాడు.

నిరంతరకార్యదీక్ష, సర్వ సమానత్వం ఆదర్శాలుగా తీరిక అన్నది యెరుగక, ప్రజాభిమానం చూరగొన్న ఈ అధ్యక్షుడు తిరిగి ఎన్నుకోబడ్డాడు. అంత పనితొందరలోనూ ఏదో ఒక విధంగా తీరికచేసుకొని చురుకైన తన ఆరుగురు పిల్లలతో కొంతసేపు కాలక్షేపం చేసేవాడు. తొట్టతొలి ఏర్పాటు ననుసరించి వైట్‌హౌస్‌ను తిరిగి కట్టించాడు. శ్రీమతి రూజ్వెల్టు ఎంతో మర్యాద మన్ననలు, తెలివితేటలు గల వైట్‌హౌస్ ఇల్లాలుగా రుజువు చేసుకొంది; అక్కడకు వచ్చేవాళ్ళందరకూ ఎంతో ఆదరణ చూపేది. ప్రెసిడెంటు విహారార్థం మొట్టమొదటిసారిగా ప్రభుత్వం విహారనౌక ఏర్పాటుచేసింది. ప్రయాణపుఖర్చుల ఖాతా ఏర్పాటుచేసుకొన్న మొదటి ప్రెసిడెంట్ రూజ్వెల్టే.

రెండవపర్యాయం అధ్యక్షపదవి తీరిపోగానే థియోడోర్ రూజ్వెల్టు వైట్‌హౌస్‌నువిడిచి, తన కుమారుడు కెర్మిట్‌ను వెంటబెట్టుకొని, ఆఫ్రికాలో సింహాలనూ, అడవిజంతువులను వేటాడటానికి ఓడఎక్కి వెళ్ళాడు. ఆయన వెళ్ళిన వివిధదేశాల రాజసభలలోనూ గౌరవపురస్సరంగా స్వాగతంపొందాడు.

యాత్రలనుండి తిరిగివచ్చినపిమ్మట తిరిగి రాజకీయాలలోనూ ప్రపంచవ్యవహారాలలోనూ పాల్గొనసాగాడు; మరల అధ్యక్షుని ఎన్నికకు పోటీ చేశాడు; కాని ఓడిపోయాడు. థియోడోర్ రూజ్వెల్టు స్వదేశంలోనూ, యూరప్‌లోనూ అధ్యక్షుడుగా ప్రజాభిమానం పొందాడు. న్యూయార్కునందలి ఆయిస్టర్‌బే లోని స్వగృహంలో తనువు చాలించాడు.



## విలియం హెచ్. టాఫ్ట్

### న్యాయమూర్తి

సెప్టెంబరు 15, 1857 — మార్చి 8, 1930

రిపబ్లికన్ — ఇరవై ఏడవ అధ్యక్షుడు 1909 - 1913

థియోడోర్ రూజ్‌వెల్టు వైట్‌హౌస్‌ను వదలి వెళ్ళే ముందు తన కిష్టమైనవ్యక్తి తన తర్వాత అధ్యక్షుడుగా ఎన్నిక కావటానికి తన పలుకుబడినంతా వినియోగించాడు; తత్ఫలితంగా ఆయన సన్నిహిత మిత్రుడైన విలియం హోవర్డు టాఫ్టు ఇరవై ఏడవ అధ్యక్షుడైనాడు. పదవీ ప్రమాణ స్వీకరణంనాడు ప్రాత అధ్యక్షుడు, క్రొత్త అధ్యక్షుడు అధ్యక్షభవనానికి అధ్యక్షశకటంమీద కలిసి వెళ్తూ వుండగా ఆకాశం పొగమంచుతో నిండీవుంది. అదిచూచి టాఫ్ట్‌అన్నాడు; "ప్రకృతికూడ అసమ్మతి తెలుపుతున్నది"; అందుకు రూజ్‌వెల్టు ఇలా బదులు చెప్పాడు; "నేను పదవి వదలి వెళ్ళేటప్పుడు మంచుగాలి వాన కురుస్తుందని నాకు తెలుసు."

ప్రజాభిమానం చూరగొన్న టెడ్డీ స్థానాన్ని ఆక్రమించటం ఎవరికైనా కష్టమే. ప్రెసిడెంట్ టాఫ్ట్ సమర్థుడు, అనుభవశాలి; కాని కష్టాల నెదిరించి పోరాడే మనిషికాదు; రాజకీయవేత్త కూడా కాదు. చాలా నిదానపుమనిషి; జాగ్రత్తగా ముందు వెనుక లాలోచించిగాని ఏ పనీ చెయ్యడు; మితవాదికూడ. ఎప్పుడూ మందహాసం చేస్తూవుంటాడు; మనసుతీర నవ్వుతాడు.

అతని ఆసక్తి అంతా న్యాయశాస్త్రంమీదనే వుండేది; అధ్యక్షుడుగా వుండాలనే కోర్కె అంతగాలేదు.

టాఫ్ట్ కుటుంబం ఓహియోయందలి సిన్‌సిన్నాట్టివారు. విలియంటాఫ్ట్ తండ్రి న్యాయవాది; ప్రెసిడెంట్ గ్రాంట్ మంత్రి వర్గంలో పనిచేశాడు. విలియమూ, అతని నలుగురన్నదమ్ములూ ఆ నగరంలో ప్రముఖులుగా పేరుపొందారు. అమెరికా అధ్యక్షులలో థియొడోర్ రూజ్వెల్టు, విలియంటాఫ్టు మాత్రమే నగరాలలో పుట్టినవాళ్ళు.



విల్ ఆజానుబాహువు, మంచి నడవడిగలవాడు; ఫుట్‌బాల్ బాగా ఆడేవాడు; ఏల్ విశ్వవిద్యాలయంలో పెద్ద విద్యార్థివేతనం సంపాదించాడు. తండ్రివలెనే ముందు న్యాయవాది యైనాడు, పిమ్మట రాజకీయనాయకుడు నైనాడు. యునైటెడ్‌స్టేట్ సంచార న్యాయస్థానపు జడ్జిగా నీతివంతుడనీ, నిర్భయుడనీ పేరుపొందాడు.

ఫిలిప్పైన్స్‌దీవులు యునైటెడ్ స్టేట్సు రక్షణక్రిందికి వచ్చిన పిమ్మట ప్రెసిడెంట్ రూజ్వెల్టు ఆ దీవులకు ప్రథమ గవర్నరుగా టాఫ్టను నియ



మించాడు. విలియంటాఫ్టు సమర్థుడైన గవర్నరనిపించుకొన్నాడు. ఫిలిప్పీయను ప్రజల విశ్వాసాన్ని, గౌరవాన్ని సంపాదించాడు. ఆ పదవి విడిచి, రూజ్వెల్టు మంత్రివర్గంలోయుద్ధ కార్యదర్శి యైనాడు.

వైట్‌హౌస్‌కు వచ్చినతర్వాత ప్రెసిడెంట్ టాఫ్టు తన పార్టీ అభిమానాన్ని కోల్పోయాడు. అందుకు కారణం అతడు రూజ్వెల్టు విధానాలను కొన్నింటిని విడిచిపుచ్చటమే. అందుకే అతన్ని మితిమించిన మితవాది అని అంటుండేవారు.

రెడ్డీరూజ్వెల్టు యూరపుయాత్ర ముగించుకొని తిరిగి రాగానే టాఫ్టును తీవ్రంగా విమర్శించాడు. వారిద్దరిమధ్య తీవ్ర మైన రాజకీయకక్ష పెరిగింది. ప్రెసిడెంటుటాఫ్టు అధ్యక్షపదవీ కాలం తీరగానే రిపబ్లికన్‌పార్టీ మరల ఆయననే తమ అభ్యర్థిగా నిర్ణయించింది. కాని రూజ్వెల్టు అనుయాయులైన కొందరు రిప బ్లికనులు తమ బలాన్ని ఉపసంహరించి, మూడవపార్టీగా ఏర్పడి, కయ్యానికి కాలుదువ్వే రెడ్డీని తమ అభ్యర్థిగా ఎన్ను కొన్నారు. రిపబ్లికన్‌పార్టీలో ఏర్పడిన ఈ చీలికవల్ల విలియం టాఫ్టూ, థియోడోర్ రూజ్వెల్టూ, ఇద్దరూ పడిపోయారు, డెమో క్రాట్ ఐన వుడ్రో విల్సన్ యునైటెడ్‌స్టేట్సు తర్వాతి అధ్య క్షుడుగా ఎన్నికైనాడు.

విలియంటాఫ్టు వైట్‌హౌస్‌ను విడిచిపెట్టాడు. కాని. ఆయన జీవితంలోని మంచిరోజు లన్నీ ముందే వున్నవి. కొన్నిసంవత్సరాలపాటు యేల్‌విశ్వవిద్యాలయంలోన్యాయశాస్త్రా ధ్యాపకుడుగా వున్నతర్వాత, యునైటెడ్‌స్టేట్సు సుప్రీంకోర్టుకు ప్రధాన న్యాయమూర్తిగా నియమించబడ్డాడు. ఆయన ఎప్పుడూ కోరింది ఈ పదవినీ, ఈ గౌరవాన్నే. ఈ పనికి ఆయన అన్నిటా తగినవాడు. తొమ్మిదేండ్లపాటు ప్రధాన న్యాయ మూర్తిగా వుండి, మరణానికి కొన్ని నెలలముందు రాజీ నామా ఇచ్చాడు. టాఫ్టు అధ్యక్షుడుగాకంటే న్యాయమూర్తిగా ఎక్కువ సుఖంగా వున్నాడు.



# ఉడ్రో విల్సన్

## ప్రపంచశాంతికి కలలుగన్న అధ్యక్షుడు

డిసెంబరు 28, 1856 — ఫిబ్రవరి 3, 1924

డెమోక్రాట్ — ఇరవై ఎనిమిదవ అధ్యక్షుడు 1913 - 1921

శాంతికాముకుడైన ఉడ్రోవిల్సన్ అధ్యక్షుడుగా ప్రమాణ స్వీకారం చేసినప్పుడు, తాను ప్రపంచమహాసంగ్రామం గుండా తనదేశాన్ని నడపవలసిన అవసరంవస్తుందనే సంగతి ఊహించనైనా ఊహించలేదు. అతడు నిశితబుద్ధిశాలి; తెలివైనవాడు; పరిపాలనచరిత్ర కూలంకషంగా తెలిసినవాడు; విద్వాంసుడు. ఆదర్శాలు, ఉన్నతభావాలు కలవాడు; నిటారయిన మనిషి; చక్కగా దుస్తులు వేసుకొనేవాడు; దృఢసంకల్పాన్ని తెలిపే ముఖం; మహోన్నతంగా కనిపించేవాడు; తన సన్నిహిత మిత్రులతో ఉల్లాసంగా వుండేవాడు. ఆదరాభిమానాలు చూపేవాడు; కాని, తక్కిన ప్రజలకు దూరంగా వుండేవాడు. ప్రజలతన్ని మెచ్చుకొనేవారు కాని ప్రేమించేవారు కాదు. అతడు అధ్యక్షుడుగా ఎన్నిక కావటానికి రిపబ్లికన్ పార్టీలో ఏర్పడిన చీలిక కొంతవరకు కారణం.

ఉడ్రో విల్సన్ ఒక క్రైస్తవ మతాచార్యుని కుమారుడు. ర్జీనియాయందలి స్టాంటన్‌లో పుట్టాడు. ఆ తండ్రికి కొడుకు ంద ఎనలేని ప్రేమ. కొడుకుకు చదువుసంధ్యలు నేర్పుతుండే డు. రోజూ గంటలకొద్దీ కొడుకుకు చదువుచెప్తూ, కొడుకుతో

మాట్లాడుతూ గడిపేవాడు. చిన్నతనంలో విల్సన్‌ను "చిన్ని టామీవిల్సన్" అని పిలిచేవారు. చిన్నిటామీవిల్సన్ బేస్‌బాల్ ఆడేవాడు. గుర్రపుస్వారీ చేసేవాడు. కాని వీటన్నిటికంటే పుస్తకా లన్నా, చదు వన్నా అతని కెక్కువ ఆనందం.

ఉత్తర కెరొలినాలోని డావిడ్‌సన్ కాలేజీలో ఒక సంవత్సరం చదివాడు. ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడైనాడు. జాన్స్ హాప్కిన్స్ విశ్వవిద్యాలయంలో డాక్టరుడిగ్రీ పొందాడు.

తర్వాత న్యాయవాదవృత్తిలో ప్రవేశించాడు, ఎక్కువ కాలం జరగకుండానే ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించి గ్రంథ రచన కుపక్రమించాడు. తర్వాత ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయాధ్యక్షుడైనాడు. కళాశాల వాతావరణాన్ని మరింత ప్రజాస్వామిక పద్ధతులపై నడపటానికి కృషిచేశాడు. ఈ కళాశాలాధ్యక్షుడు, తన రాజకీయచరిత్ర జ్ఞానము, ప్రజాస్వామికభావాలద్వారా రాజకీయ నాయకులదృష్టిని ఆకర్షించాడు. తత్ఫలితంగా న్యూజెర్సీ గవర్నరుగా ఎన్నికైనాడు. పిమ్మట యునైటెడ్‌స్టేట్సు ఇరవైయెనిమిదవ అధ్యక్షుడైనాడు.

ప్రభుత్వ వ్యవహారాలలో క్రమపద్ధతిని పునఃప్రతిష్ఠించటానికి ప్రెసిడెంట్ విల్సన్ కృషిచేశాడు. వ్యాపారసంఘాలను, భారీవర్తకాన్ని వ్యతిరేకించాడు. చిన్నవర్తకులకు ఎక్కువ అభివృద్ధిఅవకాశాలు వుండాలని కోరాడు. ఆయన పరిపాలనాకాలంలోనే స్త్రీలకు ఓటుహక్కు ఇవ్వబడింది.

ఆయన అధికారంలోకి వచ్చిన రెండవఏడు యూరప్‌లో ప్రపంచ సంగ్రామం చెలరేగింది. అమెరికాను ఈ యుద్ధానికి దూరంగా వుంచాలని ప్రెసిడెంట్ విల్సన్ దృఢంగా సంకల్పించాడు. రెండేళ్ళపాటు ఆయన సంకల్పం నేరవేరింది. "అతడు మనలను యుద్ధానికి వెలుపల వుంచాడు" అనే ఎన్నికల నినాదంతో ప్రెసిడెంట్ విల్సన్ రెండవ పర్యాయము అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. కాని ఆ సంవత్సరంలోనే యునైటెడ్‌స్టేట్సు తప్పనిసరిగా యుద్ధంలోకి దిగవలసివచ్చింది. దేశంలోని బాధ అన్నీ ప్రజలు మరచిపోయారు. ప్రెసిడెంట్ విల్సన్ దృఢనాయకత్వం క్రింద దేశం యావత్తూ ఒకే ఒక లక్ష్యంతో - యుద్ధంలో విజయం సాధించటానికి - ఒకటియై పని చేసింది.



జర్మనీ ఓటమి సమీపించగానే, ప్రెసిడెంట్ విల్సన్, శాంతి సంప్రదింపులకు పునాదిగా తన 'చతుర్దశ సూత్రాల'ను

ప్రతిపాదించాడు. ఆ నాడాయన ప్రపంచంలోకెల్ల ప్రముఖ వ్యక్తిగా పరిగణించబడ్డాడు. యుద్ధ సంక్షుభితమైన నాటి జగత్తు యావత్తు ఆయనవైపు ఆశాదృష్టులు సారించింది. యుద్ధరంగాలలో "చతుర్దశసూత్రాల" ను గురించిన కరపత్రాలు విమానాల ద్వారా పడవేశారు. అలసి సొలసివున్న సైనికులు అంతటితో ఆయుధాలు క్రిందపారవేశారు. యుద్ధం ఆగి వూరుకుంది.

సంధిషరతులను నిర్ణయించటానికి ఫ్రాన్సులో సమావేశం జరిగింది. యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడు దేశాన్ని విడిచి వెళ్ళరాదనే ఆచారం వున్నా, ప్రెసిడెంట్ విల్సన్, ప్రపంచశాంతి భావనాప్రేరితుడై, అమెరికా శాంతి ప్రతినిధివర్గ నాయకుడుగా వర్సైల్స్‌కు ప్రయాణమయ్యాడు.

తన 'చతుర్దశసూత్రాల'నూ ఆమోదింప జేయాలని అమెరికా అధ్యక్షు డెంతో పెనగులాడాడు. కాని లాభం లేకపోయింది. విజయంపొందిన దేశాలమధ్య తలయెత్తిన, స్పర్థ, దురాశలు కారణంగా ఒక సూత్రంవెంట ఒకసూత్రం తప్పనిసరిగా వదులుకోవలసివచ్చింది. తాను చిరకాలంగా కలలు కంటున్న నానాజాతి సమితి నిర్మాణాన్ని సంధిషరతులలో చేర్పించటంలోమాత్రం కృతకృత్యుడైనాడు.

ఏడునెలల కఠిన సాధనానంతరం ప్రెసిడెంట్ విల్సన్ సంధిపత్రం పట్టుకొని వాషింగ్టన్ చేరాడు. కాని, ఇక్కడ పెద్ద సంకటం ఎదురైంది. ఆయన దేశంలో లేని కాలంలో ఆయన ప్రత్యర్థులసంఖ్య పెరిగింది. యునైటెడ్ స్టేట్సు వర్సైల్సీ సంధిని నిరాకరించింది. నానాజాతిసమితిలో చేరటానికికూడా ఒప్పుకోలేదు.

మనసు విరిగిపోయి, ఆశ అడుగంటి, తీవ్రంగా జబ్బుపడి, ప్రెసిడెంట్ విల్సన్ వైట్‌హౌస్‌లో ద్వితీయ పదవీకాలం ఎలాగో వెళ్ళబుచ్చాడు. చాలా సంవత్సరాలు వాషింగ్టన్‌లో ఎవరికీ సంబంధంలేకుండా వుండి, మరణించాడు. ఆయన భౌతికదేహాన్ని వాషింగ్టన్ కేథెడ్రల్‌లో సమాధి చేశారు. నానా జాతిసమితి యేర్పడి, అందరిక్షేమానికి కృషి చేయాలని ఆయన నాడు కన్న కల నేడు మిత్రరాజ్యసమితి రూపంలో ప్రత్యక్షమైంది.



# వారెన్ హార్డింగ్

## తిరిగి యధాస్థితికి

నవంబరు 2, 1865 ఆగస్టు 2, 1923

రిపబ్లికన్ ఇరవైతొమ్మిదవ అధ్యక్షుడు 1921 - 1923

ప్రథమ ప్రపంచ యుద్ధం ముగియగానే, దేశంలో యుద్ధ పూర్వ పరిస్థితులు తిరిగి నెలకొనాలని, యునైటెడ్ స్టేట్సు ప్రజలు అన్నిటికంటే మిన్నగా కోరారు; యుద్ధాలని మరచి పోవాలని ప్రయత్నించారు; యుద్ధకాలములో విధించబడిన విధి నిషేధాలతో వాళ్ళు విసిగెత్తిపోయారు. ఉడ్రోవిల్సన్ అనంతరం, ఆయన ప్రకృతికి కేవలం విరుద్ధ స్వభావంకల వ్యక్తిని, అధ్యక్షుడుగా అభిషేకించారు; ఓహియో రాష్ట్రీయుడైన వారెన్ హార్డింగ్‌ని ఎన్నుకొన్నారు. వారెన్ హార్డింగ్ పట్టణనివాసి, అందంగా వుంటాడు; సుఖజీవన ప్రియుడు; స్నేహశీలి. "తిరిగియధాస్థితికి" అనేది హార్డింగ్ ఎన్నికల నినాదమైంది.

నూతనాధ్యక్షుని, ప్రమాణ స్వీకారానికి అధ్యక్షభవనానికి తీసుకుపోవటానికి ఓంప్రధమంగా మోటారుకారు ఉపయోగించ బడింది. ప్రెసిడెంట్ హార్డింగ్ పరిపాలనక్రింద వాషింగ్టన్ ప్రజాజీవితం ఎంతో సుఖంగా, ప్రశాంతంగా గడిచింది. శ్రీమతి హార్డింగ్, తన భర్తనుగూర్చి తననుగూర్చి "మామూలు మనుషులు" అని ఉటంకిస్తూ వుండేది.

తన తల్లి దండ్రులకు పుట్టిన ఎనమండుగురు పిల్లలలో వారెన్ హార్డింగ్ పెద్దవాడు; ఓహియోరాష్ట్రంలోని మారో కౌంటీలో పుట్టాడు. ఆయన తండ్రి రైతు; నాటువైద్యుడుకూడ. ఈ కుటుంబం సమీపంలోవున్న మారియన్ పట్టణానికిమారింది; ఇక్కడే వారెన్ హార్డింగ్ పెరిగాడు. బాల్యంలో ఎంతో ఉల్లాసంగా ఉత్సాహంగా వుండేవాడు. పట్టణ వాద్యగాళ్ళతో కలిసి



మేళం వాయిస్తూ వుండేవాడు. చదువు ధ్యాసేలేదు. వార్తాపత్రిక కార్యాలయంలో పనిచేయాలని ఎంతో సంబరపడుతుండేవాడు; కొంతకాలం విలేఖరిగా పనిచేశాడు; పంధొమ్మిదవయేట మారియన్‌స్టార్ అనే వార్తాపత్రిక యజమానులలో ఒకడైనాడు. ఈ పత్రిక అతికష్టంమీద నడుస్తూవుండేది. కాని పట్టణం పెరుగుదలతోపాటు పత్రిక అభివృద్ధి చెందింది. హార్డింగ్ ధారాళంగా మాట్లాడేవాడు. చాలామంది రాజకీయవేత్తలతో

పరిచయంవుంది. తర్వాత తానే రాజకీయాలలో ప్రవేశించి, ముందు రాష్ట్ర సెనేటర్ ఐనాడు, పిమ్మట స్వరాష్ట్రానికి గవర్నరైనాడు. ఆ పిమ్మట యునైటెడ్ స్టేట్సు సెనెటరైనాడు.

దేశప్రజల విశ్వాసం, అభిమానం చూరగొని, హార్డింజ్ యునైటెడ్ స్టేట్సు ఇరవైతొమ్మిదవ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. విశ్వశాంతి పరిరక్షణకొరకు, ఆయుధబలాల తగ్గింపునుగూర్చి వాషింగ్టన్‌లో ఒక సమావేశం జరిగింది. గ్రేట్ బ్రిటన్, జపాన్, యునైటెడ్ స్టేట్సు పదేళ్ళపాటు క్రొత్త యుద్ధనౌకలు తయారుచేయకుండా వుండటానికీ, అప్పుడున్న యుద్ధనౌకల సంఖ్యను, పరిమాణాన్ని తగ్గించటానికీ అంగీకరించినవి. కొంత కాలానికి జపాను ఈ ఒడంబడికను ఉల్లంఘించింది.

ప్రెసిడెంటు హార్డింజ్ తప్పుచేసినవాళ్ళను క్షమించేవాడు. తన స్నేహితులలో చాలామందికి ప్రభుత్వోద్యోగా లిచ్చాడు; వీరిలో కొందరు తాము స్వీకరించిన పదవులను అవినీతిపాలు చేశారు. తన పరిపాలననుగురించి నానాటికి పెరిగిపోతున్న అపకీర్తిని మోసేదాకా ఆయన బ్రతుకలేదు. పడమటి ప్రాంతంలోనూ, అలాస్కాలోనూ విధివిరామం లేకుండా పర్యటనచేసి వచ్చి, శాన్‌ఫ్రాన్సిస్కోలో అకస్మాత్తుగా ప్రాణాలు విడిచాడు. ఆయన ప్రెసిడెంట్‌గావున్నది రెండేళ్ళుమాత్రమే. కాని, తానధిష్ఠించిన ఆ ఉన్నత పదవీ బాధ్యతలకు తగినవాడు కాడని రుజువుపరచుకొన్నాడు.



# కాల్విన్ కూలిడ్జి

జులై 4, 1872 — జనవరి 5, 1933

రిపబ్లికన్ — ముప్పదియవ అధ్యక్షుడు 1923 - 1929

ఉపాధ్యక్షుడు కాల్విన్ కూలిడ్జి వెర్‌మాంట్ కొండలలో వున్న తమ వ్యవసాయ క్షేత్రంలో విశ్రాంతికై వెళ్ళి వుండగా అధ్యక్షుడు హార్డింగ్ మరణవార్త తెలిసింది. వాళ్ళపొలం ఇంటికి టెలిగ్రాం అర్ధరాత్రి చేరింది; తండ్రి ఆయనను లేపి చెప్పాడు. కాల్విన్ కూలిడ్జి తండ్రి స్థానిక న్యాయాధికారి; ఆ తెల్లవారుఝామున ఆ ఇంటి కచేరి గదిలో కిరోసినులాంతరు వెలుతురులో ఆయన తన కొడుకు చేత యునైటెడ్ స్టేట్సు అధ్యక్షపదవీ ప్రమాణం చేయించాడు. తర్వాత కొంతసేపటికి కూలిడ్జి వాషింగ్‌టన్‌కు ప్రయాణమైనాడు.

కాల్విన్ కూలిడ్జి మితభాషి, నీతివంతుడు, నిరాడంబరుడు. నూటికినూరుపాళ్ళు, న్యూ ఇంగ్లాండుమనిషి. పొట్టిగా, వుంటాడు. పాలిపోయిన ముఖం, ఎప్పుడూ చిత్రంగా ముఖం ముడుచుకొని వుంటాడు. ఆ కవళికకూ, ఆయన ఆడే చప్పని హాస్యానికీ బాగా జతకుదిరింది. రాజకీయాలలో ఆయనకు బాగా అనుభవం వుంది. ఎందుచేతనంటే - పురపాలక సంఘంలో సభ్యుడుగా రాజకీయ జీవిత మారంభించి, ఒక పదవినుండి మరొక పదవికి

క్రమక్రమంగా అధిరోహిస్తూ మస్సాచూసెట్స్ గవర్నరైనాడు; తర్వాత ప్రెసిడెంట్ హార్డింగ్ క్రింద ఉపాధ్యక్షుడైనాడు.

వెర్మాంటులోని ప్లయ్‌మౌత్ గ్రామంలో కాల్విన్‌కూలిడ్జి పుట్టాడు. ఈ గ్రామంలో కొన్ని ఇళ్ళు, ఒక చర్చి, ఒక దుకాణంమాత్రం వుండేవి. కూలిడ్జి తండ్రి వ్యవసాయదారు; దుకాణంకూడా నడిపేవాడు. కాల్ పన్నెండవ ఏట తల్లి చని పోయింది; తండ్రి చాలా పొదుపరి, నిలకడగల మనిషి. ఆయన అదుపాజ్ఞలలో కాల్ పెరిగి పెద్దవాడైనాడు. భోగ భాగ్యాలు లేకపోయినా ఒడుదుడుకులు లేకుండా గడిచింది. వాళ్ళ వెర్మాంట్ కొండనేల పొలంమీద తండ్రీ కొడుకులు చెమ టోడ్చి చాకిరి చేసేవాళ్ళు.

ఆమ్‌హర్‌స్టు కాలేజీలో పట్టభద్రు డయ్యేనాటికి అతడి కింకా పల్లెటూరి పిల్లవాడి లక్షణాలు పోలేదు; బిడియపడుతూ వుండేవాడు; అట్టే మాట్లాడేవాడు కాడు. మస్సాచూసెట్స్‌లోని నార్తాంప్టన్‌లో న్యాయవాదవృత్తి ఆరంభించాడు; తర్వాత రాజ కీయజీవితంలో ప్రవేశించి చివరకు అధ్యక్షుడైనాడు.

కాల్విన్‌కూలిడ్జి అధ్యక్షుడైన పిమ్మట ఆయన తీసికొన్న తొలిచర్యలలో ప్రభుత్వ వ్యవహారాలు చక్కబరచటం ఒకటి. అవినీతిపరులను పదవులనుండి తొలగించాడు. ప్రభుత్వంలో పొదుపరితనంకోసం గట్టి పట్టుపట్టాడు. తర్వాత ఇంకా, ఇంకా పొదుపరితనం అమలుపరచాడు. ఆదాయపుపన్నులు తగ్గించాడు.



విదేశవ్యాపారం అభివృద్ధిచేశాడు; విమాన పరిశ్రమను ప్రోత్స హించాడు; దేశం అన్నివిధాల అభ్యుదయం పొందింది.

హార్డింజ్ పదవీకాలం పూర్తిచేసినపిమ్మట ఆయన స్వయంగా అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. పెనుసయిన పల్లెటూరి మాటలలో చెప్పిన ఆయన పదవీ స్వీకారోపన్యాసం మొట్ట మొదటిసారిగా దేశ మంతటికీ రేడియో ప్రసారం చేయబడింది.



దేశమంతా సుభిక్షంగా వుంది; యునైటెడ్ స్టేట్సులోని మధ్యతరగతి ప్రజలందరకు టెలిఫోను, రేడియో, కారు ఏర్పడ్డాయి.

మెయిల్ పైలెట్ అయిన చార్లెస్ విండ్ బర్గ్ అనే యువకుడు తన ఒంటి ఇంజను విమానంలో న్యూయార్కునుండి పారిస్‌కు, మధ్యలో ఎక్కడా ఆగకుండా సరాసరి ప్రయాణం చేయటంతో విమానయానం నూతనస్థాయి అందుకొన్నది.

నిజాయితీపరుడు, పొదుపరి ఐన అధ్యక్షుడు లభించినందుకు సంతోషపడుతూ దేశం తన అభ్యుదయపథాన నడుస్తూ వుంది. రెండవసారికూడా ఆయన అధ్యక్షుడుగా నిలుస్తాడని ప్రజలంతా ఆశించారు. "1928 అధ్యక్ష ఎన్నికలకు నేను

నిలవటంలేదు" అనే ఒక్కముక్క చెప్పి, ఆయన దేశాన్ని యావత్తు ఆశ్చర్యంలో ముంచేశాడు.

వైట్‌హౌస్‌ను ఎంత నిశ్చలంగా ప్రవేశించాడో అంత నిశ్చలంగా విడిచి వెళ్ళాడు. నార్తాంప్టన్‌లో మరల తన పూర్వపు నిరాడంబర జీవితాన్ని స్వీకరించాడు. తర్వాత రాజకీయాలలో ఎన్నడూ జోక్యం కలిగించుకోలేదు; అధ్యక్ష పదవి వదలిన పిమ్మట ఆయన నాలుగేండ్లుమాత్రం జీవించివున్నాడు. ★

## హెర్బర్టు హూవరు

### క్వేకరు అధ్యక్షుడు

ఆగస్టు 10, 1874 -

రిపబ్లికన్ ముప్పది ఒకటవ అధ్యక్షుడు 1929 - 1933

"కూలిడ్జి అభ్యుదయం" కొనసాగుతూవుండగా ప్రెసిడెంట్ కూలిడ్జి అనంతరం హెర్బర్టు హూవరు అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. హూవరు మంచి వర్తకుడు; నిపుణతగల గనుల ఇంజనీరు. ఆయన క్వేకరు క్రైస్తవ తెగకు చెందినవాడు; యుద్ధకాలంలో యుద్ధ బాధితుల సహాయం కొరకు తన యావచ్ఛక్తినీ, ధనాన్నీ సమర్పించాడు.

ఆయన ఎన్నికల సమయంలో యునైటెడ్ స్టేట్సులో పరిస్థితులు చాలా ఆశాజనకంగా వున్నాయి. 'ప్రతి ఇంట కారు' 'ప్రతిభోజనంలో కోడి' వుంటుందని ప్రజ లాశించారు. కాని ఈ అభ్యుదయం మరుగున అపాయ చిహ్నాలు దాగివున్నాయి. ఒకవంక వ్యాపారం దెబ్బ తింటున్నది; రెండవవంక పండించిన పంటలకు సరైన ధరలు లేక రైతులు బాధపడుతున్నారు. ఆజానుబాహువు, గంభీరుడు ఐన ఆ ప్రెసిడెంటు గుండ్రని ముఖం శాంతభావం నిండివుండేది; కాని, తన పరిపాలన కాలంలో ఆయన ముఖంలో ఒక చిరునవ్వుకు కూడా ఆస్కారం కన్పించలేదు.

హెర్బర్టుహూవరు అయోవాయందలి పచ్చికమైదానాల నుండి వచ్చాడు; వెస్ట్‌బ్రాంచ్ అనే చిన్న పట్టణంలో పుట్టాడు; అక్కడ అతని తలిదండ్రులు, క్వేకరు మతవిశ్వాసాన్ని అనుసరించి నిరాడంబరంగా, నిస్స్వార్థంగా, బ్రతుకుతుండే వారు. అతని తండ్రి కమ్మరం, వ్యవసాయం చేస్తుండేవాడు. తల్లి 'మిత్రుల' సంఘంలో ఉపన్యాసకురాలుగా వుండేది. ఆయనకు ఎనిమిదేండ్ల వయస్సప్పుడు తల్లి, తండ్రీ ఇద్దరూ



చనిపోయారు; పద్నాలుగవ యేట ఒరిగాన్‌లో పిన తండ్రివద్ద పనిచేస్తూ వున్నాడు.

అప్పటికే ఆ పిల్లవాడు రాళ్ళు రప్పలు యేరి పరిశీలిస్తూ వుండేవాడు; పినతండ్రివద్ద వుండగా, గనుల ఇంజనీరు కావాలని సంకల్పించాడు. కాలిఫోర్నియా యందలి లీలాండ్ స్టాన్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో చేరాడు; ఆఫీసు బంట్రోతుగానూ, హోటలు పనివాడుగానూ,- ఇంకా ఏ పని దొరికితే ఆ పని చేస్తూ - ఇంజనీరింగులో పట్టభద్రుడైనాడు.

కెనడా గనులలో పార, గునపము చేతపట్టుకొని ప్రవేశించి, హూవరు అంతర్జాతీయ ప్రతిష్ఠగల ఇంజనీరింగు సలహాదారుడైనాడు. తొలుదొల్త ఆస్ట్రేలియా, చైనాలకు, తర్వాత అనేక విదేశాలకు ఇంజనీరింగు సలహాదారుడుగా వెళ్ళాడు; చాలా డబ్బు గడించాడు.

ప్రపంచయుద్ధం ప్రజ్వరిల్లినప్పుడు హూవరు లండన్‌లో వున్నాడు. యుద్ధ భీతులై, దిక్కుతోచక వేలకొలది అమెరికన్లు స్వదేశానికి వెళ్ళలేక అక్కడ చిక్కుపడిపోయారు. ఆయన వారికొక సహాయసంస్థను నెలకొల్పాడు. దాని ద్వారా వాళ్ళు స్వదేశానికి తిరిగి వెళ్ళటానికి అవకాశం కలిగింది. యుద్ధ కాలంలో బెల్జియం దేశస్థుల కాయన చాలా తోడ్పడ్డాడు. ఆయనకృషి ఆ చిన్నదేశం ప్రజలను క్షామానికి బలికాకుండా కాపాడింది. ప్రెసిడెంటు విల్సను ఆయనను అమెరికాకు తిరిగి రప్పించి. "ఆహార పరిపాలక" పదవి నిచ్చాడు. ఆయన ఆ పదవిలోవుండి, యూరప్‌లోని సైన్యాలకు ఆహారపానీయాల కొరతలేకుండా చూచాడు; అంతేకాక, అమెరికా ప్రజలు తమ కున్న దానినే యూరపులోని అన్నాతురులైన ప్రజలతోపాటు పంచి కుడిచేట్లు కూడా చూచాడు. ఆయన స్థాపించిన ఒక నిధి ద్వారా యూరపులోని లక్షల బాల బాలికల జీవితాలు రక్షించ బడ్డాయి.

యుద్ధం ముగిసింది; వాణిజ్య కార్యదర్శిగా పనిచేసిన పిమ్మట హెర్బర్టు హూవరు అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. ఏడు



నెలల తర్వాత అనుకొనని రీతిగా ఆర్థికమాంద్యం దేశాన్ని అలుముకొన్నది; వ్యాపార వాణిజ్యాలు కూలిపోయినవి. అధ్యక్షుడు హూవరు తన పరిపాలనకాలం యావత్తు, ఆర్థిక మాంద్యంతో పోరాడుతూ, ఆర్థికమాంద్యంనుండి కోల్కొ-న టానికి మార్గాల నన్వేషిస్తూ గడిపాడు. వ్యాపార రంగంలో ప్రభుత్వజోక్యం కలిగించుకోవటం ఆయనకు సుతరాము ఇష్టంలేదు. అందుచేత ఆర్థికమాంద్యాన్ని నిరాకరించటానికి ఇతర మార్గా లన్వేషించాడు. ఆ మహా ఆర్థికమాంద్యపు కారు మేఘాలు ప్రపంచ మంతా వ్యాపించి వున్నాయి. యూరప్‌ను పూర్తి ఆర్థిక వినాశంనుండి కాపాడటంకోసం అమెరికా కివ్వ తేలిన యుద్ధరుణాలను కొన్నిటిని ఒక సంవత్సరం వాయిదా వేస్తూ, మరికొన్నిటిని తాత్కా-లికంగా నిలుపుదలచేస్తూ ప్రెసిడెంటు హూవరు ప్రకటన చేశాడు.

ఆయన పదవీకాలాంతానికి, అవసరమైనవాళ్ళకు ఋణా లివ్వటానికి ప్రభుత్వసంస్థ ఒకటి నెలకొల్పబడింది; కాని, అప్పటి

కింకా పరిస్థితు లాందోళనకరంగానే వున్నాయి. లక్షల ప్రజలు నిరుద్యోగులుగా వున్నారు; లక్షలమంది నిరుద్యోగభృతి తీసి కొంటున్నారు. దేశంయావత్తు భయభ్రాంతమైపోయింది; మరొక నూతన నాయకునికొరకెదురు తెన్నులు చూస్తున్నది. తర్వాత అధ్యక్షుడుగా ఫ్రాంక్లిన్ డెలినో రూజ్వెల్టును అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. వైట్‌హౌస్‌ను విడిచి వెళ్ళిన తర్వాతకూడ హెర్బర్టు హూవరు ప్రపంచ వ్యవహారాలలో శ్రద్ధాసక్తులు చూపుతున్నాడు.



## ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టు
## "నూతన విధానమ్ము"

జనవరి 30, 1882 ఏప్రియల్ 2, 1945

డెమోక్రాట్ ముప్పదిరెండవ అధ్యక్షుడు 1933 - 1945

తీవ్ర ఆర్థిక మాంద్యంతో భయభ్రాంతమై, దిక్కుతోచకుండా వున్న అమెరికనుజాతి, నూతన పరిపాలనకోసం, నూతన నాయకత్వంకోసం ఫ్రాంక్లిన్ డెలినో రూజ్వెల్టు వంక ఆశాదృష్టులను ప్రసరించింది. ముప్పైరెండవ అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టు పొడగరి, విశాలవక్షస్థలంతో సంతోషంగా, వుత్సాహంగా వుండేవాడు.

ఆయన రూపురేఖలు శక్తిని స్ఫురింపజేస్తూ వుండేవి; అభ్యుదయ భావాలు కలవాడు. తన శక్తిసామర్థ్యాలపై పరిపూర్ణ ఆత్మవిశ్వాసం కలవాడు. దేశానికి నూతనవిధానం, వెనుకపడిన ప్రజలకు సహాయం ఇస్తానని ఆయన వాగ్దానం చేశాడు; భయాన్నిచూచి తప్ప వేరే భయపడవలసిందిలేదని ప్రజలకు అభయమిచ్చాడు.

ఈ నూతనాధ్యక్షునకు దురదృష్టవశాత్తు ఒక పెద్ద శారీరకలోపం ఏర్పడింది. అధ్యక్షుడు కాకముందు పన్నెండేండ్ల క్రితం ఆయనకు పక్షవాతం వచ్చింది. పట్టుదలతో ఆ వ్యాధిని నయం చేసుకొన్నాడు కాని, అప్పటినుండి ఏదో ఒకటి అవ



లంబనం వుంటే గానీ నడువగలిగేవాడు కాదు; అలాగే, కాలికి కట్టో చంక కర్రలో వుంటే గానీ, నడువకలిగేవాడు కాడు. అయితే, ఈ లోపంవల్ల తన ఆశయాలకు గానీ, జీవితానికిగానీ ఎలాటి అంతరాయం రానీయలేదు.

ఫ్రాంక్లిన్ డెలినో రూజ్వెల్టు థియోడోర్ రూజ్వెల్టుకు దూరపు దాయాది. గొప్ప భోగభాగ్యాలు, ఉన్నతసంస్కారంగల కుటుంబంలో పుట్టాడు; న్యూయార్కులో, హైడ్ పార్కు వద్ద హడ్సన్ నది కెదురుగా వున్న తమ జమీలో జన్మించాడు. తల్లిదండ్రులకు ఆయన ఒక్కడే కొడుకు; ఆ ఏకైక పుత్రుడంటే తల్లికి ప్రాణం. తనతో ఆడుకొనేందుకు పిల్లలు తప్ప అతనికి కావలసిన వన్నీ వున్నాయి. ఆ పిల్లవాణ్ని ఇల్లుదాటి పోనిచ్చేదికాదు; విద్యాప్రారంభం ఇంట్లోనే ప్రయివేటు మాష్టర్ల ద్వారా జరిగింది. అతనికి గుర్రాలంటే చాలాప్రీతి; అతని కొక

చిన్న గుర్రం వుండేది; దానిమీద అతనికి తగని ప్రీతి. గుర్రపు ప్రదర్శనలలో స్వారి చేస్తూ వుండేవాడు. సముద్రయానమన్నా, నావికులన్నా కూడా ఆ పిల్లవాడికి ఎంతో మక్కువ. అతనికి స్వంతంగా ఒక చిన్న పడవవుండేది. దానిపై అతడు విహరిస్తూ వుండేవాడు. చిన్నతనంలో, తల్లిదండ్రులతో చాలా పర్యాయాలు యూరపు పర్యటన చేశాడు.

అతడు మొట్టమొదట చేరిన పాఠశాల గ్రోటన్‌పాఠశాల. అక్కడినుండి హార్వర్డులో, తర్వాత కొలంబియా న్యాయకళాశాలలో చేరాడు. అక్కడనుండి న్యూయార్కులోని ఒక న్యాయ వృత్తి సంస్థలో చేరాడు.

స్టేట్ సెనెట్ సభ్యత్వంతో ఆయన రాజకీయ జీవిత మారంభమైంది. ఆ ఎన్నికల ప్రచారంలో గ్రామప్రాంతాలలో ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు తన ఎర్రటిరంగు కారులో సంచారం చేశాడు. ఆ కాలంలో గ్రామప్రాంతాల రోడ్లమీద కార్లుతిరగటం అరుదు.

తర్వాత ఆయన నౌకాశాఖ సహాయకార్యదర్శిగానూ, పిమ్మట న్యూయార్కు స్టేట్ గవర్నరుగానూ పనిచేశాడు. అధ్యక్ష అభ్యర్థిగాపార్టీ ఎన్నుకొన్నప్పుడు, తన అంగీకారాన్ని సభలో అంగీకారోపన్యాసం చేయటంకోసం ఆల్బనీనుండి చికాగోకు విమానంమీద వచ్చాడు. విమానంమీద ప్రయాణం చేసిన మొదటి అమెరికా అధ్యక్షు డాయనే.



వైట్‌హౌస్‌లో అడుగు పెట్టగానే వెంటనే స్థిరసం కల్పంతో కార్యాచరణకు పూనుకొన్నాడు. అధ్యక్షుడుగా ప్రమాణ స్వీకరణ చేసిననాడే మంత్రివర్గాన్ని ఎన్నుకొన్నాడు. ఆ రెండోనాడు బ్యాంకులన్నీ మూసివేయించినాడు. బాగా నడుస్తున్న వాటినే తెరవటాని కేర్పాటు చేశాడు. కరెన్సీకి బంగారం ప్రమాణం విడిచిపుచ్చాడు. ప్రజాసంక్షేమంకొరకు కోట్లడాలర్లు మంజూరైంచె. ఆర్థికమాంద్యంవల్ల ఏర్పడిన సమస్యలను పరిష్కరించటానికి అనేక సంస్థలు నెలకొల్ప బడినవి. నిరుద్యోగులుగా వున్న లక్షలాది జనానికి పనిపాటలు చూపటంకోసం అనేక రకాల పధకాలు ప్రారంభించబడినవి. అధ్యక్షుడు రేడియోద్వారా తరచు ప్రజలతో మాట్లాడుతుండే వాడు. స్నేహమయమూ, ఉత్సాహజనకమూ ఐన ఆయన కంఠధ్వని ప్రజలకు ధైర్యాన్ని పురికొల్పుతుండేది. ఈ ఇష్టాగోష్ఠి

రేడియో ఉపన్యాసాలు అమెరికావారే కాక లోకమంతటా వింటూండేవాళ్ళు.

దేశం యావత్తు ఫ్రాంక్లిన్ రూజ్వెల్టుకు, ఆయన నూతన విధానమునకు అండగా నిలచింది. ప్రజ లాయనను మరొకసారి అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. నాలుగేండ్ల పిమ్మట మూడవ పర్యాయం ఆయన అధ్యక్షుడుగా ఎన్నికై రెండుపర్యాయములకు మించి అధ్యక్షుడుగా ఒకేవ్యక్తి వుండరాదనే అమెరికా సాంప్రదాయాన్ని భేదించాడు. మూడవసారి ఎన్నికలకాలంలో ఇంగ్లాండు ఫ్రాంసుదేశాలు, జర్మనీ, ఇటలీదేశాలతో తీవ్రయుద్ధంచేస్తున్నవి. జర్మనీ, ఇటలీలతో పోరాడేదేశాలకు అమెరికా విశేషంగా ఆయుధాలను, ఇతర వస్తువులను పంపటానికి వీలుగా అరువు కౌలు చట్టం ఆమోదించబడింది.

అప్పటికింకా యునైటెడ్ స్టేట్సు యుద్ధంలో దిగలేదు. మెల్లమెల్లగా ఆర్థికమాంద్యంనుండి కోలొకొంటున్నది. అంతలో దేశాన్ని మరొక నూతన ప్రమాదం ఎదుర్కొన్నది. జపాను సాయుధసైన్యాలు, అకస్మాత్తుగా హవాయ్‌లోని అమెరికా నౌకా స్థావరాలపై బడి, భయంకరంగా విధ్వంసం చేశాయి. ఆ పిమ్మట కొన్నిరోజులకు జర్మనీ, ఇటలీలు యునైటెడ్ స్టేట్సుపై యుద్ధం ప్రకటించాయి.

నిరవధికమైన అధికారాలను మంజూరుపొంది, ప్రెసిడెంట్ రూజ్వెల్టు దేశకృషినీ, సామర్థ్యాన్నీ యావత్తూ యుద్ధ విజయ



సాధనవైపు మరల్చాడు- ముందు జర్మనీని ఓడించాలి. తర్వాత జపాన్ను. మహాసముద్రాన్ని నౌకలమీద, విమానంమీద దాటి అధ్యక్షుడు స్వయంగా ఆఫ్రికాలో, కైరోలో, టెహరాన్‌లో, యాల్టాలో, ఇతర దేశాల పరిపాలకులను కలిసికొన్నాడు; మహత్తరమైన నిర్ణయములు చేయబడినవి.

యుద్ధం ముగియవచ్చేకాలంలో రూజ్వెల్టు నాల్గవపర్యాయము అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. ప్రపంచాన్ని యుద్ధభయం నుండి రక్షించటంకోసం ఆ రోజులలో ఆయన మిత్రరాజ్య సమితి నిర్మాణమునకు కృషిచేస్తున్నాడు. కాని, నాల్గవపర్యాయం ఎన్నికైన తర్వాత ఆయన కొన్ని నెలలమాత్రం జీవించి

వున్నాడు. పన్నెండున్నర ఏండ్లపాటు ఆర్థికమాంద్యంలో, యుద్ధంలోనూ దేశాని కాయన సారథ్యం వహించాడు. అది ఆయనను పీల్చి పిప్పిచేసింది. జార్జియాయందలి వారమ్ స్ప్రింగ్స్ నందున్న "లిటిల్ వైట్‌హౌస్‌లో" ఆయన హఠాత్తుగా మరణించాడు.

జీవితమంతా ఆయన అనేకరంగాలలో పనిచేశాడు. ఆయనకు నౌకలన్నా, సముద్రమన్నా ప్రీతి; పోస్టుబిళ్ళలను దీక్షతో సేకరించేవాడు. ఇన్‌ఫాన్ టైల్ పెరాలిసిస్ ఫౌండేషన్ స్థాపనకు తోడ్పడుటేగాక, తనవలెనే ఆ వ్యాధిబారి పడినవారికి డబ్బిచ్చి, పనిచేసి, తోడ్పడ్డాడు; పర్యటన అంటే ఆయనకెంతో ప్రీతి; ప్రపంచమంతటా ఆయనకు స్నేహితు లున్నారు.

వజ్రసంకల్పమూ, మహా ప్రతిభాసమూ కల అమెరికా అధ్యక్షులలో ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు ఒకరు. దేశప్రజల కళ్యాణం కొరకు నూతన బాధ్యతలు వహించిన ప్రభుత్వాన్ని ఆయన సృష్టించాడు. ★

# హారీ యస్. ట్రూమన్

## మసోరీ మనిషి

మే 8, 1884.

డెమోక్రాట్ ముప్పది మూడవ అధ్యక్షుడు 1945-1953

ప్రెసిడెంటు రూజ్వెల్టు నాల్గవపర్యాయం ఎన్నికైనప్పుడు, మసోరీ సెనెటర్ హారీ యస్ ట్రూమన్ ఉపాధ్యక్షుడుగా తీసికొనబడ్డాడు. నాలుగు నెలల తర్వాత ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు మరణించగానే, యునైటెడ్ స్టేట్సు ముప్పది మూడవ అధ్యక్షుడుగా ప్రమాణం స్వీకరించటానికి వైట్ హౌస్ నందలి మంత్రివర్గమందిరానికి ఉపాధ్యక్షుడు పిలువ నంపబడ్డాడు. ఆ మరునాటి ఉదయం అధ్యక్షవిధులను స్వీక రిస్తూ, ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు "నూతన విధాన" మునే కొనసాగిస్తానని ప్రెసిడెంట్ ట్రూమన్ దేశానికి మాట ఇచ్చాడు.

ఈ నూతనాధ్యక్షుడు కాకలుతీరిన రాజకీయవేత్త; అందరితో స్నేహంగా వుంటాడు. ఎప్పుడూ నవ్వుతూ వుంటాడు. నీటుగా, చురుకుగా వుంటాడు. చకచక నడుస్తాడు. మసోరీ యాసతో మాట్లాడుతాడు. మనుషులమీద చాలా మమ కారం. పత్రికలకు వెగటుగా తోచినా లెక్కచెయ్యక స్నేహితుల కంటిపెట్టుకొని వుంటాడు.

హారీ ట్రూమన్ పల్లెటూరి పిల్లవాడు. మసోరీలోని లామర్ అనే ఒక చిన్నపట్టణంలో, ఒక వ్యవసాయ క్షేత్రంలో

జన్మించాడు. ఆయన తండ్రి గుర్రాలు, కంచరగాడిదల వ్యాపారం చేస్తుండేవాడు; హైస్కూలువిద్య పూర్తి చేసినపిమ్మట వెస్ట్‌పాయింట్ మిలిటరీ ఎకాడమీలో చేరబోయాడు. కాని, అతని కాశాభంగం కలిగింది అతనిచూపు మాంద్యంకారణంగా వాళ్ళు చేర్చుకోలేదు. చిన్నతనంనుండి ఆయన లావాటికళ్ళద్దాలు ధరిస్తూ వుండేవాడు.

తాతగారి వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తూ, దరిమిలా, ఫస్ట్ లెఫ్ట్‌నెంటుగా సైన్యంలో చేరాడు. ఫ్రాన్సులో యుద్ధంలో పనిచేశాడు. ఫిరంగి దళంలో కేప్టన్ ఐనాడు యుద్ధానంతరం ఆయన పురుషుల దుస్తుల దుకాణం ఒకటి తెరచాడు.కాని ఈ యత్నం కలిసిరాలేదు. ఒక సైనిక మిత్రునిద్వారా, ట్రూమన్, టాం కు పెండర్ గాస్ట్ ను కలుసుకొన్నాడు. ఈయన పలుకుబడి గల మిస్సౌరే రాజకీయ నాయకుడు. ఈయన సహాయంతో అతడు పల్లెటూళ్ళ న్యాయాధికారి ఐనాడు. తర్వాత



త్వరలోనే, యునైటెడ్ స్టేట్సు సెనేటు సభ్యుడుగా ఎన్నికైనాడు. సెనెటర్ గా వుండగా, జాతీయరక్షణ కార్యక్రమంలో దుబారాను విచారించుటకై ఏర్పడిన సంఘాని కాయన అధ్యక్షుడుగా నియమించబడ్డాడు. ఈ సంఘంలో ఆయన చేసిన కృషికి ఎంతో ప్రజాదరణ, గౌరవం లభించింది.

హారీట్రూమన్ అధ్యక్షుడుగా ఎన్నికైననాటి నుండి ఎన్నో ప్రముఖ నిర్ణయాలను చేయవలసివచ్చింది. ఆయన వైట్ హౌస్‌లో ప్రవేశించి నెలగాకముందే జర్మనీ లొంగిపోయింది. ప్రెసిడెంట్ ట్రూమన్ యూరప్ వ్యవహారాలు చక్కబరచుటకై పోస్ట్‌డాంకు ప్రయాణమై వెళ్ళాడు. యుద్ధాన్ని త్వరితగతిని ముగించటంకోసం జపాన్‌లో అటంబాంబు వేయటానికి ఆయనే నిర్ణయించవలసి వచ్చింది.

జపాన్ లొంగిపోయిన అనంతరం ప్రెసిడెంట్ ట్రూమన్ తన శక్తిసామర్థ్యాలను దేశంలోని వివిధసమస్యల వైపు మరలించాడు. అంతేకాక, "సమరసవిధాన" మని పేరు పొందిన విధానం కొరకు కృషిచేశాడు.

1948లో స్వయంగా అధ్యక్షుని ఎన్నికలకు నిలచాడు. సామాన్యప్రజలను ఆయన బాగా అర్థం చేసుకొన్నాడు. వాళ్ళకేమి కావాలో ఆయనకు తెలుసును; రైలుమీద ఎన్నికల ప్రచారం చేస్తూ దేశమంతటా పర్యటించాడు; ఎన్నికలరైలు మీదనుండే ఆయన ఎకాయెకి సామాన్యప్రజలకు వినతిచేశాడు.



ఆయన తీవ్ర స్వభావం ప్రజలకు నచ్చింది. మరొకసారి ఆయన అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

ఆ తర్వాత నాలుగేండ్లు కార్మిక వివాదాలు చెలరేగినవి; యూరపులో యుద్ధానంతర సమస్యలు తలయెత్తినవి; కొరియాలో యుద్ధం రేగింది. కొరియాలో కమ్యూనిస్టులదాడి నరికట్టడానికి మిత్రరాజ్యసమితి పతాకంక్రింద అమెరికను సైన్యాలు పంపబడినవి.

ట్రూమన్ పరిపాలనాకాలంలో ఒక రాజ్యాంగ సవరణ ఆమోదించబడింది. దీనిప్రకారం, రెండుపర్యాయములకంటే ఎవరుగానీ అధ్యక్షుడుగా వుండకూడదు; ఒకవేళ, క్రిందటి అధ్యక్షుని పదవీ కాలంలో మిగిలిన పదవీకాలంలో సగంగానీ,

అంతకు ఎక్కువగానీ అధికారంలోవున్న అధ్యక్షుడు ఆ పిమ్మట ఒక్కసారే అధ్యక్షుడుగా వుంటాడు. ఐతే, ఈ నిబంధననుండి ట్రూమన్ మినహాయించ బడినప్పటికినీ, మూడవపర్యాయం అధ్యక్షుడుగా ఆయన ఎన్నికలకు నిలువలేదు.

1952లో డెమోక్రాటిక్ అభ్యర్థిగా నిలచిన అడ్లయ్ స్టీవెన్సన్ ఎన్నికల ప్రచారంలో ప్రెసిడెంట్ ట్రూమన్ తీవ్రంగా పనిచేశాడు. కాని ఎడ్లయ్ స్టీవెన్సన్ ఓడిపోయాడు; కడచిన ఇరవై ఏండ్లలో మొదటిసారిగా ఒక రిపబ్లికన్ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. 

# డ్వైట్ డి. ఐసన్ హోవర్

## జనరల్ ఐక్

అక్టోబరు 14, 1890

రిపబ్లికన్ ముప్పదిరెండవ అధ్యక్షుడు 1953

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం శాంతి నెలకొంటుందని అందరూ ఆశించారు; కాని,1952నాటికి దానిరూపు రేఖలు కూడా కనిపించలేదు. ప్రపంచంలో అన్ని దేశాలలోనూ, ఇంకా అశాంతి వుండనే వుంది. ఏ ఆదర్శాలమీద, ఏ సిద్ధాంతాలమీద నైతే అమెరికా సంయుక్తరాష్ట్రాలు నిర్మించబడినవో అవి మసక మసకగా, చిందరవందరగా కనిపించసాగాయి. అందుచేత, దేశానికి వజ్రసంకల్పం, స్థిరచిత్తం కలిగిన నాయకుని అవసరం పూర్వం కంటే హెచ్చుగా కన్పించింది. చాలా సమస్యల నెదుర్కొన వలసి వున్నది.

కొరియాయుద్ధంలో దేశం చిక్కుకొని వున్నది. అమెరికా ఆశయాలకు విరుద్ధమైన రాజకీయభావాలు ప్రభుత్వంలో చొర బడ్డాయి. పన్నులు, ప్రజల జీవనవ్యయం పెరిగినవి. యుద్ధాలు, ఆర్థికమాంద్యం ఫలంగా జాతీయ ఋణం విపరీతంగా పెరిగింది. ధైర్యసాహసాలు, విజ్ఞత,మహోన్నత సిద్ధాంతాలు కల వ్యక్తి మాత్రమే దేశాన్ని ఈ కష్టకాలంనుండి గట్టెక్కించగలడు.

ఎన్నో ప్రమాదాలతో నిండిన ఈ పరిస్థితులలో యునైటెడ్ స్టేట్సు ప్రజలు డ్వైట్ డి. ఐసెన్‌హోవరును తమ ముప్ఫైవాలుగవ అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు.

డ్వైట్ ఐసన్‌హోవరు టాక్సాస్ నందలి డెనిసన్ అనే చిన్న పట్టణంలో జన్మించాడు. అతనికి సంవత్సరమైనా నిండక ముందే ఆ కుటుంబం కాన్సాస్‌లోని మైదాన ప్రాంతంలోవున్న ఎబిలేన్‌కు తరలిపోయింది. అక్కడ అతని బాల్యం గడచింది. ఆయన తల్లి దండ్రులు రివర్ బ్రదరెన్ అనే క్రైస్తవసంప్రదాయానికి చెందిన వారు. ఈ శాఖకు చెందిన వారు సాధారణమైన దుస్తులు వేసుకొని చాలా నిరాడంబరంగా జీవిస్తారు. ఆయన తల్లి దండ్రులకు దేశభక్తి మెండు. జీవిత లక్ష్యాన్ని సాధించాలంటే కష్టపడి, నిజాయితీగా పనిచేయట మొకటే మార్గమని ఆ తల్లి దండ్రులు తమ ఆరుగురు మగబిడ్డలకు బోధించారు. ఐక్ కూరగాయలమ్మి ఆ పేద సంసారానికి తోడ్పడు





తుండేవాడు. హైస్కూలువిద్య పూర్తిచేసిన పిమ్మట ఒక వెన్నదుకాణంలో పనిచేశాడు.

తర్వాత వెస్ట్‌పాయింట్‌లో చేరాడు; ఇక్కడ చదువు సంధ్యలలో గట్టివాడని పేరు తెచ్చుకొన్నాడు. ఫుట్‌బాల్‌జట్టుతో ఆడుతుండేవాడు. అక్కడ పట్టభద్రుడైన పిమ్మట లెఫ్టినెంట్ ఐసన్‌హోవరు సైనికోపాధ్యాయుడుగా పనిచేశాడు. ప్రథమ ప్రపంచ సంగ్రామంలో విదేశరంగాలకు వెళ్ళాలని చూచాడు కాని, ప్రభుత్వం ఆయనను దేశంలోనే వుంచింది.

ప్రథమ, ద్వితీయ ప్రపంచసంగ్రామాల మధ్యకాలంలో కాన్సాస్ నందలి ఫోర్టులీవెన్‌వర్తులోని జనరల్‌స్టాఫ్ స్కూలులో

చరిత్రగతి అంతటిలో మొదటివాడుగా ఉత్తీర్ణుడైనాడు. పిమ్మట ఫిలియప్పియనులో జనరల్ డగ్లస్ మెకార్థర్ క్రింద ఆరేండ్లు పనిచేశాడు.

ద్వితీయప్రపంచయుద్ధకాలంలో ఐసన్‌హోవరు ప్రముఖ సేనా నాయకుడుగా గణుతికెక్కాడు. బ్రిగేడియర్ జనరల్ పదవినుండి గబగబ ఎగబ్రాకి యూరపునందలి మిత్రరాజ్య సైన్యాలకు సర్వ సైన్యాధ్యక్షుడైనాడు. యుద్ధానంతరం సైనికోద్యోగం వదలి కొలంబియా విశ్వవిద్యాలయాధ్యక్షుడైనాడు.

అటుపిమ్మట కొద్దిసంవత్సరాలకు జనరల్ ఐక్ తిరిగి సైనికోద్యోగాని కాహ్వానితుడై నాటో (నార్త్ అట్లాంటిక్ ట్రీడీ ఆర్గనై జేషన్) సైన్యాలన్నిటికి కమాండర్‌గా యూరపువెళ్లాడు. యూరపు సైన్యా లన్నిటిని కమ్యూనిస్టు దురాక్రమణనుండి రక్షణకు ఏకముఖం చేయవలసివుంది; కష్టసాధ్యమైన ఈ ప్రముఖ కార్యభారం ఆయన వహించాడు.

1948 సంవత్సరపు అధ్యక్షుని ఎన్నికలలో ఉభయ పక్షాలూ ఆయనను తమ అభ్యర్థిగా వరించినవి. అందు కాయన అంగీకరించలేదు. సైనికోద్యోగిగానే తాను స్వదేశాని కెక్కువ సేవచేయగలనని ఆయనవిశ్వాసం. నాలుగేండ్ల తర్వాత, ఎంతో వత్తిడిచేయగా, తనదేశం సమర్పింపగల ఈ అత్యున్నత పదవికి అభ్యర్థిగా తనపేరు సూచించటానికి అంగీకరించాడు. తాను రిపబ్లికన్‌గా ప్రకటించుకొన్నాడు. సైనికోద్యోగానికి రాజీ



నామా ఇచ్చాడు; అధ్యక్ష ఎన్నికలకు తీవ్రంగా పనిచేశాడు. బ్రహ్మాండమైన రిపబ్లికను మెజారిటీతో అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

డ్వైట్ ఐసన్‌హోవరు ఇంతకుముందు మహాకష్టసాధ్యమైన పనులను నిర్వహించాడు. సైన్యంలో నీతి, స్థిరసంకల్పం గల నాయకుడుగా రుజువుపరచుకొన్నాడు. ఐదు నక్షత్రపతకాల ఈ జనరలు మహాసైనికుడనీ, బాధ్యతలు నిర్వహించగల దక్షుడనీ లోకానికి తెలుసును. జనరలుగా యుద్ధంలో కఠినంగా వర్తించేవాడు. కాని, సైనికాధికారిగా సైనికులయెడ దయాదాక్షిణ్యాలతో, సమరసంగా వర్తించేవాడు. అరమరలు లేని మనిషి. అందరితో చనువుగావుంటాడు. ఉత్సాహంగా చిరునవ్వునవ్వుతూ, శాంతంగా, గంభీరంగా వుంటాడు.

డ్వైట్ ఎసన్‌హోవరు అధ్యక్షుడుగా ఎన్నికైనవెంటనే తన మంత్రివర్గాన్ని ఎన్నుకొన్నాడు. అందువలన పాత మంత్రివర్గ సభ్యులతో నూతనమంత్రులు ముఖ్య సమస్యలపై సంప్రదించటానికి అవకాశం కలిగింది. ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న గొప్ప సమస్యలలో కొరియా యుద్ధం ఒకటి కావటంచేత, అమెరికా అధ్యక్షుడుగానూ, సర్వ సైన్యాధ్యక్షుడుగానూ తానీ సమస్యల విషయంలో సత్వరంగా విజ్ఞతతో వ్యవహరించటానికి కావలసినభోగట్టాను వీలైనంత మట్టుకు సేకరించేతలంపుతో ఆయన తలవని తలంపుగా కొరియా యుద్ధరంగంలో ప్రథమశ్రేణులలోకి విమానంమీద వెళ్ళాడు.

1953లో ఆయన వైట్‌హౌస్ ప్రవేశించినప్పుడు దేశనేతగా తానెంత మహత్తరబాధ్యతల నెదుర్కొనవలసి వుందో బాగా గుర్తించాడు. తానెంతో సేవ చేసిన ఈ దేశంలో శాంతి భద్రతల స్థాపనకు తన చిరకాల సైనికానుభవాన్ని అంకితం చేయవలసిన సమయం ఇప్పుడు వచ్చింది.

నూట ఇరవై నాలుగేండ్లపూర్వం, జార్జి వాషింగ్‌టన్ యునైటెడ్‌స్టేట్సు ప్రథమాధ్యక్షుడుగా ప్రమాణ స్వీకారం చేశాడు. ఈ ముప్పైనాలగవ అధ్యక్షుడుకూడా అదేప్రమాణం ప్రతి అమెరికనుకు స్వాతంత్ర్యమనే సూత్రంపై నిర్మించబడిన ఈ మహాదేశం - 'అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగాన్ని భద్రపరచటానికీ, సంరక్షించటానికీ, సమర్థించటానికీ' స్వీకరించాడు.



